

# చందమామ

డిసెంబర్ 1995



ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు






విడి ప్రతి : 5.00

సంవత్సర చందా : 60.00

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి







## యువత — నేరప్రవృత్తి

రెండవ ప్రపంచ యుద్ధానంతరం, అంటే — గత యాభైయేళ్ళుగా—ప్రపంచ వ్యాప్తంగాపలుదేశాలలో నేరాలసంఖ్య పెరుగుతూనేఉన్నది. వీటిలో సగం నేరాలు 15—25 మధ్య వయసుగల యువతీయువకులే చేయడం మరింత ఆందోళనకరమైన విషయం!

యువతీయువకులలో నేరప్రవృత్తి ప్రబలడానికి ముఖ్యంగా మూడు కారణాలు చెబుతారు: విచ్ఛిన్నమైన కుటుంబ వ్యవస్థ; ఉగ్రరూపం దాల్చుతూన్న నిరుద్యోగ సమస్య; రోజురోజుకూ ఉన్నవారికీ, లేనివారికీ మధ్య పెరిగిపోతూన్న అగాధం!

ఒకప్పుడు ఉమ్మడికుటుంబాలలో లభించిన ప్రేమానురాగాలు ఈనాటి యువతకు లభించడం లేదు. ఆ కారణంగా వారిలో అభద్రతాభావం పెరిగి అలజడి పుట్టిస్తున్నది. కుటుంబ వ్యవస్థ విచ్ఛిత్తికి ఒకవిధంగా యువతీయువకులు కూడా కారణం అని చెప్పాలి. ఎందుకంటే, ఏమాత్రం సంపాదనాపరులయినా, స్వతంత్రం కావాలంటూ తల్లిదండ్రులను వదిలి వెళ్ళిపోయేది పిల్లలే!

ఈనాడు విద్యావకాశాలు పెరిగాయి. కాని, వాటికి సమానంగా ఉద్యోగావకాశాలు పెరగడం లేదు. 'నేనా? నువ్వా?' అనే పోటీ మనస్తత్వం నిరాశా నిస్పృహలకు చోటిచ్చి హింసాప్రవృత్తిని పురికొల్పేదిగా ఉన్నది.

ఈ పరిస్థితి మారాలంటే యువతీ యువకుల శక్తి సామర్థ్యాలను సమాజం పూర్తిగా ఉపయోగించుకోవాలి. సమాజ సేవ, నిర్మాణాత్మక కార్యక్రమాలలో యువతకు అవకాశాలు కల్పించాలి. యువత, తమ గురుతర బాధ్యతలను గుర్తెరిగి నడుచుకోవాలి!


సంపుటి : 97 డిసెంబర్ '95 సంచిక: 6

విడిప్రతి : 5.00 సంవత్సర చందా : 60.00




# తల్లులారా!
# పోలియో నిర్మూలన
# మీవల్లనే సాధ్యం!




## డిసెంబర్ 9, జనవరి 20 తేదీలు
## జాతీయ పోలియో నిరోధక దినాలుగా
## ప్రకటించబడ్డాయి.

మీరు మీ పిల్లలకు ఇంతకు ముందే పోలియో చుక్కమందు వేయించి ఉన్నప్పటికీ, మరింత భద్రత కోసం, మీ సమీపంలో ఉన్న పోలియో నిరోధక శిబిరాలలో డిసెంబర్ 9, జనవరి 20 తేదీలలో మూడేళ్ళ లోపు మీ పిల్లలకు మళ్ళీఒకసారి పోలియో చుక్కమందు వేయించండి.

ఆరోగ్యవంతులైన పిల్లల భవిష్యత్తే — మనదేశ భవిష్యత్తు!

**క్రీ॥ శ॥ 2000 సం॥ నాటికి**
**పోలియోలేని**
**ఇండియాను**
**రూపొందించడంలో**
**సంతోషంగా**
**పాలుపంచుకుందాం!**





**PolioPlus**

**డిసెంబర్ 9, 1995**
**జనవరి 20, 1996**
**తేదీలను**

గుర్తుంచుకోండి!
అవి మీ
పిల్లలను
సంరక్షించుకునే రోజులు!

వార్తలు - విశేషాలు :

# ఐక్యరాజ్యసమితి స్వర్ణోత్సవాలు

ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యాలయం ఉన్న న్యూయార్క్ నగరంలో గత అక్టోబర్ నెలలో మూడురోజులపాటు ఐక్యరాజ్య సమితి స్వర్ణోత్సవాలు ఘనంగా జరిగాయి. ఈ యాభై యేళ్ళ ఉత్సవాలలో దాదాపు 180 దేశాల నుంచి ప్రధాన మంత్రులూ, అధ్యక్షులూ, ప్రభుత్వాధినేతలూ పాల్గొన్నారు.

అక్టోబర్ 22వ తేదీ అమెరికా అధ్యక్షుడు బిల్ క్లింటన్, రష్యా అధ్యక్షుడు బోరిస్ ఎల్ట్సిన్, క్యూబా అధ్యక్షుడు ఫీడెల్ కాస్ట్రో, పాలస్తీనా నాయకుడు యాసర్ అరాఫత్ మొదలైనవారు ఉపన్యసించారు. 23వ తేదీ ఫ్రెంచి అధ్యక్షుడు జాకస్ చిరాక్, బ్రిటిష్ ప్రధానమంత్రి జాన్ మేజర్ ప్రసంగించారు. మన భారత ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు మూడవరోజు ప్రసంగించారు. జనరల్ అసెంబ్లీని ఉద్దేశించి మొత్తం మీద 185 మంది ప్రపంచ నాయకులు ప్రసంగించారు. ఒక్కొక్కరి ప్రసంగానికి ఐదు నిమిషాలు మాత్రమే కేటాయించారు.

1914-18 మధ్య మొదటి ప్రపంచ యుద్ధం జరిగి ముగిసిన తరవాత, అప్పటి దేశాల నాయకులు కలిసి, మునుముందు మరొక ప్రపంచ యుద్ధ ప్రమాదం రాకూడదని ప్రపంచ దేశాల సమాఖ్యను (లీగ్ ఆఫ్ నేషన్స్) స్థాపించారు. కాని ఆ లక్ష్యం నెరవేరలేదు. 1939వ సం॥లో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయింది.

ఆరేళ్ళపాటు సాగిన ఆ యుద్ధం లక్షలాది మందిని బలిగొన్నది. అటువంటి భయానకమైన పరిస్థితి ఏర్పడకుండా భావితరాలను రక్షించాలన్న ఉన్నత లక్ష్యంతో 1945 జూన్ 26వ తేదీ ఐక్యరాజ్య సమితి ఆవిర్భవించింది. శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగిన తొలి సమావేశంలో యాభై దేశాల నాయకులు పాల్గొని యు.ఎన్. చార్టర్‌లో సంతకాలు చేశారు. అలా సంతకాలు చేసిన దేశాలలో మన దేశం కూడా ఒకటి. స్వీడన్‌కు చెందిన ట్రిగ్వీ లీ ఐక్యరాజ్య సమితికి మొట్టమొదటి ప్రధాన కార్యదర్శి అయ్యాడు.

ప్రపంచంలో అక్కడక్కడ ముఖ్యంగా వియత్నాం, కంబోడియా, కొరియా, యుగోస్లావియా, పాలస్తీనా, అరేబియా సింధుశాఖ వంటి మొదలైన చోట్ల యుద్ధాలు సాగినప్పటికీ గత యాభైఏళ్ళుగా తన ఉనికిని నిలుపుకున్న ఐక్యరాజ్య సమితి లక్ష్యం కొంతవరకు నెరవేరుతున్నదనే చెప్పాలి.

రాజకీయ సమస్యలనే కాకుండా, వివిధరంగాలలో నెలకొన్న సమస్యలను పరిష్కరించాలన్న ఉద్దేశంతో ఐక్యరాజ్య సమితి బాలల నిధి (యూనిసెఫ్) విద్యా, వైజ్ఞానిక సాంస్కృతిక సంస్థ (యునెస్కో), ప్రపంచ ఆరోగ్య సంస్థ, అంతర్జాతీయ కార్మిక సంస్థ, అంతర్జాతీయ న్యాయస్థానం మొదలైన వాటిని ఏర్పరచి ఆయా రంగాలలో ఇతోధికంగా కృషి చేస్తున్నది.

ఐక్యరాజ్య సమితి రెండవ ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయిన హెమర్స్క్ జోల్డ్, "ఐక్యరాజ్యసమితి ఆవిర్భావం మనల్ని స్వర్గానికి తీసుకుపోవడానికి కాదు,నరకం నుంచి రక్షించడానికి" అని చెప్పారు. ఇప్పటి కార్యదర్శి బుట్రోస్ బుట్రోస్ ఘాలీ స్వర్ణోత్సవాలకు విచ్చేసిన ప్రపంచ నాయకులనుద్దేశించి, "మిమ్మల్ని మీ ఇంటికి ఆహ్వానిస్తున్నాను. శాంతి అవగాహనల కోసం కృషి చేస్తున్న ప్రపంచ ప్రజల వేదిక మీదికి మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాను," అన్నారు.

ఐక్యరాజ్య సమితి అటువంటి ఉదాత్త లక్ష్యంతో, వెలుగు మార్గంలోనే పయనించడానికి యువతరం నాయకులు కృషి చేయాలి.






# పులిచేసిన పెళ్ళి

మణిపురాన్ని శశిధరుడనే రాజు పాలించేవాడు. ఆయనకు వేట ఆరవప్రాణం. కాలక్షేపం కోసం వారానికొకసారి వేటకు వెళ్ళేవాడు.

ఒకరోజు, శశిధరుడు కొంతమంది భటులను వెంట బెట్టుకుని, ఉత్తమాశ్వాలను పూన్చిన రథంలో అడవికి వేటకు వెళ్ళాడు. ఆయన మధ్యాహ్నం వరకూ కొన్ని జింకలనూ, అడవిపందులనూ వేటాడాడు. తర్వాత, తన పరివారంతో, ఒక పెద్ద జువ్విచెట్టు కిందికి చేరాడు. అక్కడ అందరూ భోజనాలు ముగించారు. కొద్దిసేపు విశ్రాంతి తర్వాత, తిరిగి వేట ప్రారంభిద్దామని ఆయన, భటులకు చెప్పాడు.

శశిధరుడు జువ్వి చెట్టు బోదెకు చేరగిలబడ్డాడు. ఇంతలో పక్కన వున్న పొదల మధ్య నుంచి, పులి ఒకటి గాండ్రిస్తూ, ఆయన పైకి దూకింది. ఇది చూసి భటులు దిగ్భ్రాంతులై కలవరపడుతున్నంతలో శశిధరుడు తన పక్కనవున్న డాలును, మెరుపు వేగంతో ఎడమ చేతితో అందుకుని, పులి పంజా దెబ్బ కాచుకున్నాడు. పులి మరింత పెద్దగా గాండ్రిస్తూ వెనకకాళ్ళమీదనిలబడి, ముందుకు దూకబోయేంతలో, శశిధరుడు తన ఒరలోని కత్తిని సర్రున బయటికి లాగి, ఒక్క దెబ్బతో పులి కంఠాన్ని నరికివేశాడు.

ఇది చూసిన భటులు రాజు సాహసాన్ని మనసులోనే మెచ్చుకున్నారు. వాళ్ళు రక్తపుమడుగులో గిలగిల తన్నుకుంటున్న పులిచుట్టూ చేరేంతలో, పొదలలో ఏదో అలికిడయింది.

శశిధరుడు పులిరక్తంతో తడిసిన కత్తిని అలాగే పట్టుకుని, అప్రమత్తతతో పొదలవైపే చూడసాగాడు. అంతలో ఒక పులిపిల్ల పొదల చాటు నుంచి బయటకు వచ్చి, దాపులనున్న ఒక భటుడికేసి చిన్నగా గాండ్రించింది. దానికి నెలరోజులు కూడా నిండి వుండవు.

తర్వాత అది చచ్చిపడివున్న పులి చుట్టూ తిరుగుతూ మూలగసాగింది. ఈ దృశ్యం

రాఘవరాజు పట్టాభిరామరాజు

చూసిశశిధరుడిమనసుద్రవించింది.ఆయన నెమ్మదిగా పులిపిల్ల వెనకగా వెళ్ళి, దాన్ని ఒడిసిపట్టుకున్నాడు.అది గుర్రు గుర్రుమంటూ, తన చిన్న పంజాతో శశిధరుడి చేతుల్ని రక్కింది.

శశిధరుడు, పులిపిల్ల మీద ఎంతో జాలి కనబరుస్తూ, "శాంతించు! ఆత్మరక్షణార్థం, మీ అమ్మను చంపక తప్పలేదు!" అన్నాడు.

ఆ రోజుకు అంతటితో వేట మాని, రాజు కోటకు తిరిగి వచ్చాడు. రాణి గిరిజాదేవి, పులిపిల్లను చూసి, "ప్రభూ! ఎంతయినా ఇది క్రూరజంతువు! పెద్దయ్యాక ఇది ప్రమాదకరంగా మారుతుంది. అరణ్యంలోని పులి పిల్లను అంతఃపురానికి చేర్చారు. అపాయాన్ని కోరి తెచ్చుకున్నట్లవుతుందేమో, ఆలోచించండి," అన్నది.

శశిధరుడు నిట్టూర్పు విడిచి, అడవిలో జరిగిందేమిటో చెప్పి, "తల్లిలేని దీన్ని పెంచేందుకు తీసుకువచ్చాను. చిన్నతనం నుంచీ మనుషుల మధ్య పెరిగితే, దీని క్రూర స్వభావం అంతరిస్తుందని,నానమ్మకం. అలా కానప్పుడు, తిరిగి అడవిలో వదిలేస్తే సమస్య తీరిపోతుంది!" అన్నాడు.

ఆ రోజు నుంచీ ముప్పూటలా రాజే, పులి పిల్లకుస్వయంగాపాలు పట్టేవాడు. నెలరోజులు గడిచే సరికి అది అందరికీ మచ్చిక అయిపోయింది.అంతఃపురమంతా పిల్లిలా కలియ తిరిగేది. రాణిఒడిలో పడుకుని నిద్రపోయేది.



ఏడాది గడిచేసరికి అదిబాగాపెరిగి పెద్దదైపోయింది. ఇప్పుడది పులిపిల్ల కాదు, పులి. పసుపుపచ్చ శరీరం మీద నల్లటి చారలు వచ్చాయి. మాంసాహారం తినడం ప్రారంభించింది. అయితే, అది మనుషులకు గానీ, తక్కిన అంతఃపుర పెంపుడుజంతువులకు గానీ ఎటువంటి హానీ తలపెట్టేదికాదు.

ఇలా వుండగా, పులి వీపు మీద వ్రణం లాంటిదొకటి లేచింది. అది వారం గడిచేసరికి అరచేతిమందానికివిస్తరించింది.పశువైద్యుడు, ఆ పుండును పరీక్షించి, రాజుతో, "ప్రభూ! ఇది జంతువులకు అరుదుగా వచ్చే రాచ పుండు. మామూలు ఔషధాలకు, ఈ వ్యాధి లొంగదు. దీనిని నివారించే లేపనం తయారు



చేసేందుకు కావలసిన పన్నెండు వనమూలికలలో, ఒక్కటి మాత్రం నా వద్దలేదు. దాని పేరు సిందూరసుధపుష్పం. లేత పసుపుపచ్చ రంగులో, గజం ఎత్తు పెరిగే, ఈ సిందూరసుధ మొక్క, ఏడాదికి ఒకేఒక పువ్వు పూస్తుంది. ప్రస్తుతం, ఈ మొక్క రత్నపురి మహారాజు ఆనందవర్ధనుడి ఉద్యానవనంలో వున్నట్లు విన్నాను," అన్నాడు.

ఆనందవర్ధనుడి పేరు వినగానే, శశిధరుడి ముఖం కోపంతో జేవురించింది. దాదాపు ఇరవైసంవత్సరాల కిందట జరిగిన,ఒక సంఘటన ఆయన కళ్ళ ముందు కదిలింది.

అప్పట్లో, కాంచనపురి యువరాణి మదన మంజరి వివాహానికి, స్వయంవరం ఏర్పాటు చేశాడు, ఆమె తండ్రి భూపాలవర్మ. మదన మంజరి అద్భుత సౌందర్యాన్ని గురించి విని వున్న అనేక మంది రాజులు, తమ అదృష్టం బావుంటే, ఆమె తమను వరించవచ్చునన్న ఆశతో, స్వయంవరానికి వెళ్ళారు. రాజు శశిధరుడు కూడా ఆ స్వయంవరానికి వెళ్ళాడు. ఆయన అప్పటికే వివాహితుడు.

మదనమంజరి స్వయంవరం వెనక దాగి వున్న రహస్య మేమంటే — ఆమే, రత్నపురి రాజుఆనందవర్ధనుడు పరస్పరం ప్రేమించుకున్నారు.కాని, స్వయంవరం ఏర్పాటు చెయ్యడం వంశాచారం కనుక, ఏదో మొక్కుబడిగా స్వయంవరం ఏర్పాటుచేశాడు, ఆమె తండ్రి.

ఈ కారణంవల్ల, మదనమంజరి స్వయంవర మండపంలో ఆసీనులైన ఇతర రాజుల వైపు కనీసం కన్నెత్తి కూడా చూడకుండా వెళ్లి ఆనందవర్ధనుడి మెడలో వరమాల వేసి భర్తగా వరించింది.

ఆ సమయంలో శశిధరుడు, ఆనందవర్ధనుడి పక్కనే కూర్చుని వున్నాడు. ఆనందవర్ధనుడు, ఆయన వైపు ఓరగా చూసి, కోర మీసందువ్వి, 'చూశావా!స్వయంవరం పోటీలో, నా విజయం,' అన్నట్లు వ్యంగ్యంగా నవ్వాడు.

మదనమంజరి, తనను వరించలేదన్న బాధలోవున్న శశిధరుడికి, ఇది పుండు మీద కారం చల్లినట్లనిపించింది.

మణిపురి, రత్నపురి ఇరుగుపొరుగు దేశాలైనందున సహజంగానే కొన్ని సరిహద్దు వివా

దాలున్నాయి. అందువల్ల శశిధరుడికీ, ఆనంద వర్ధనుడికీ పరస్పర శత్రుభావం అంతర్గతంగా వున్నది. ఇప్పుడీ స్వయంవర ఫలితం ఒకరికి ఆనందం కలిగిస్తే,మరొకరికి తీవ్రమైన అసూయకు కారణమైంది.

ఈ కారణాలవల్ల, ఆనందవర్ధనుడు మీసం దువ్వగానే శశిధరుడు దిగ్గున ఆసనం నుంచి లేచి, ఒర నుంచి కత్తి దూసి, "ఒక స్త్రీ చేత వరింపబడడం ఘనకార్యంగాభావించి మురిసి పోకు! వీరుడివైతే, నన్ను కత్తియుద్ధంలో ఓడించు," అన్నాడు.



దీనికి ఆనందవర్ధనుడు రెచ్చిపోయి, "ఉట్టినే కత్తియుద్ధం అంటే, అందులో పస ఏముంటుంది?మనకెలాగూ ముత్యాలదీవి సరిహద్దు వివాదం వుంది కదా! ఇప్పుడు మన మధ్య జరగబోయే కత్తియుద్ధంలో గెలిచినవారిదే ముత్యాలదీవి.ఇందుకు నువ్వు అంగీకరిస్తే, పోటీకి నేను సిద్ధం," అన్నాడు కత్తిపిడి మీద చెయ్యివేసి.

శశిధరుడు వెంటనే, ఈ షరతుకు అంగీకరించాడు. తన ఖడ్గవిద్యానైపుణ్యం సాటిలేనిదన్న నమ్మకం, ఆయనకున్నది. క్షణంలో స్వయంవర వేదిక, సమర రంగానికి వేదిక అయింది.

ప్రత్యర్థులిద్దరూ సమఉజ్జీలుగా చాలాసేపు పోరాడారు. క్రమేపీ ఆనందవర్ధనుడి శక్తి సన్నగిల్ల సాగింది. ఇది గమనించిన శశిధరుడు రెట్టించిన ఉత్సాహంతో కత్తిని తిప్పసాగాడు. అంతలో ఆయన కత్తిదెబ్బకు ఆనంద వర్ధనుడు తప్పించుకోవడమూ, ఆ దెబ్బ శశిధరుడి ఎడమ చేతిని గాయపరచడమూ, కత్తి అప్రయత్నంగా ఆయన చేతి నుంచి జారిపోవడమూ క్షణంలో జరిగిపోయింది.

ఆ విధంగా, తన చేతిలోని కత్తితోనే, తన ఎడమ చేతిని గాయపరుచుకుని, శశిధరుడు ఓటమి పాలయ్యాడు. శత్రువు సామర్థ్యం వల్లకాక, తన దురదృష్టం వల్ల కత్తియుద్ధంలో ఓడిపోయినందుకు ఆయన చాలా బాధపడ్డాడు. ఆ నాటి నుంచీ ఆనందవర్ధనుడిపై తీవ్రమైన ద్వేషాన్ని పెంచుకున్నాడు.

రాణి గిరిజాదేవి, తన భర్త మనసులో మెదులుతున్న భావ సంఘర్షణను ఊహించి,



"ప్రభూ! ఇది పంతాలకూ, పట్టింపులకూ సమయం కాదు.ఏదో విధంగా ఆనంద వర్ధనుడిఉద్యానవనంలోనిసింధూరసుధ పుష్పాన్ని సంపాదించి, మనం ఇన్నాళ్ళూ ఎంతో ప్రేమతో పెంచుతున్న పులిని కాపాడుకోవడం, మన కర్తవ్యం కాదా?" అన్నది.

శశిధరుడు ఒకటి, రెండు క్షణాలు ఆలోచించి, "రత్నపురిపై దండెత్తి, ఆనందవర్ధనుణ్ణి ఓడించి, ఆ పుష్పాన్ని సంపాదిస్తే!" అన్నాడు.

"ప్రభూ!యుద్ధంలో జయాపజయాలు దైవాధీనాలంటారు. కీడెంచి మేలెంచాలి కదా! మీరు యుద్ధంలో గెలిచారే అనుకుందాం. సింధూరసుధపుష్పం, మీకు దక్కుతుందని నమ్మకం ఏమిటి? మీపై ద్వేషంతో ఆనంద వర్ధనుడు, యుద్ధ ప్రారంభానికి ముందే సిందూరసుధమొక్కను కూకటి వేళ్ళతో పెకలించి వేస్తే, మీరు ఏం చేయగలరు? పైగా, పులికి చికిత్స కోసంఅవసరం అయిన ఒక పుష్పం కోసం, ఏకంగా పొరుగు దేశం మీదికి దండెత్తి వెళ్ళడం అంటే — పొరుగు రాజులు మిమ్మల్ని గురించి ఏమనుకుంటారో ఆలోచించారా?" అంటూ రాణి, భర్తకు హితవు చెప్పింది.

"అయితే, ఇప్పుడు పులిని కాపాడుకునే మార్గంఏమిటో కూడా, నువ్వే చెప్పు!" అన్నాడు శశిధరుడు చిరాకుగా.

అప్పుడు గిరిజాదేవి మృదువుగా, "మీరు ఆగ్రహించకపోతే, నాదొక సూచన. మన యువరాజు దీప్తిశేఖరుడూ, ఆనందవర్ధనుడి కుమార్తె చందనవల్లీ పరస్పరం ప్రేమించుకున్నారు. పరిస్థితుల కారణంగా, ఈ సంగతి రహస్యంగా వుంచాను, క్షమించాలి! మీరు ఆశీర్వదిస్తే," అంటూ ఆగింది.

వెంటనే శశిధరుడు కోపంగా, "నా శత్రువుతోవియ్యమా?అసంభవం.అది నా బొందిలో ప్రాణం వుండగా జరగదు," అన్నాడు.

రాణి కొద్దిసేపు మౌనంగా వుండి, "ప్రభూ! సహజంగా అడవిలో నివసించే ఈ పులి, క్రూరజంతువు. అలాంటిది మనుషుల మధ్య పెరిగి సాధు ప్రవృత్తిని అలవరచుకున్నది. నోరూ వాయీ లేని జంతువులో, ఇలాంటి అనూహ్యమైన పరివర్తన వచ్చినప్పుడు, విచ

క్షణాజ్ఞానంవున్నమనిషిగాజన్మించి—పైపెచ్చు దేశ పాలకుడుగా వున్న మీరు, సాటి మనిషితో స్నేహభావంతో మెలగ లేక, అకారణంగా కాలు దువ్వడం జంతుప్రవృత్తి అనిపించుకోదా? క్షమించాలి, నా మాటలు కొంత కటువుగా వుండవచ్చు! అడవిలో మన పెంపుడు పులి తల్లిని మీరు వధించారు. అందుకని పెంపుడు పులి మీపై పగ సాధించిందా? క్రూర జంతువైన పులిలో వున్న క్షమాగుణం,మీలో లేకపోవడం చూసి నాకు ఆశ్చర్యంతో పాటు విచారం కలుగుతున్నది!" అన్నది తీవ్రస్వరంతో.

శశిధరుడికి, రాణిమాటలు ఈటెల్లా తగిలాయి.హేతుబద్ధంగా ఆమె పలికిన పలుకులు, ఆయనను తీవ్రంగా ఆలోచింపచేశాయి.

కొంతసేపటికి ఆయన దీర్ఘంగా ఒక నిట్టూర్పు విడిచి, "సరే! మనతో వియ్యమందడానికి, ఆనందవర్ధనుడికి అభ్యంతరం లేకపోతే, ఈవివాహం నాకూ సమ్మతమే. ముందు రత్నపురి నుంచి అపుష్పాన్నితెప్పించి, పులికి చికిత్స చేయించాలి!" అంటూ రత్నపురికి పంపించడానికి భటుడికోసం కేకవేశాడు. ఇంతలో రాణీ,వెనక వైపున ద్వారం వద్ద నిలబడివున్న పశువైద్యుడికి సైగ చేసింది. వైద్యుడు, శశిధరుడి ముందుకు వచ్చి నమస్కరించి, "మన్నించండి, ప్రభూ! మీతో అబద్ధం చెప్పాను. పులికి చికిత్స చేయడానికి, ఆ సిందూరసుధపుష్పం అవసరం లేదు. నా దగ్గరున్న మూలికలతో లేపనం తయారు చేసి, రేపే చికిత్సప్రారంభిస్తాను.పుండు మానిపోతుంది. మీలో పరివర్తన రావాలనీ, మణిపురి, రత్నపురి దేశాల మధ్య బాంధవ్యం ఏర్పడితే, అది ప్రజాసంక్షేమానికి మంచిదన్న అభిప్రాయంతో, మహారాణి ప్రోత్సాహం కొద్దీ, ఈ సాహసానికి పూనుకున్నాను," అన్నాడు.

ఆ మాటలకు శశిధరుడు మందహాసం చేసి, "మహారాణికి ఇవ్వవలసిన కానుక, తరవాత ఇచ్చుకుంటాను. నువ్వు పశువైద్యుడివే కాదు; మనుషుల్లోని పశుప్రవృత్తికి కూడా చికిత్సచేయగలిగినఉత్తమ వైద్యుడివి!" అంటూ తన మెడలోని రత్నహారాన్ని, వైద్యుడికి బహూకరించాడు.



# నియమం

రామశర్మ, వెంకటశాస్త్రి, గురుమూర్తి అనే యువకులు వైద్యవిద్య పూర్తిచేసి, తమ గ్రామం చేరి వివాహాలు చేసుకున్నారు. తర్వాత ముగ్గురూ కలిసి ఆలోచించుకుని, తాము విడివిడిగా వైద్యవృత్తి ప్రారంభిస్తే, అసూయా, స్పర్థలకు లోనవుతామనుకుని, అంతా కలిసి ఒకేచోట వైద్యాలయం ప్రారంభించారు. ఇందుకుగాను, వాళ్ళు చేసుకున్న నియమం ఏమంటే — చికిత్స కోసం వచ్చేవాళ్ళు ముందుగా మూడు రూకలు చెల్లించాలని.

ఒకనాడు, రామశర్మ భార్య జానకీదేవికి హఠాత్తుగా తలపోటు వచ్చింది. ఆమె వెళ్ళి సమయానికి కనిపించిన గురుమూర్తితో, రామశర్మను చూడాలన్నది. గురుమూర్తి ముందుగా మూడు రూకలు చెల్లించమన్నాడు.

"నేనెవరో తెలుసుగదా? నేను డబ్బు చెల్లించడమేమిటి!" అన్నది జానకీదేవి కోపంగా.

"అమ్మా, అది మా నియమం!" అన్నాడు గురుమూర్తి.

జానకీదేవి ఇంటికి తిరిగివెళ్ళి, డబ్బు తెచ్చి గురుమూర్తికిచ్చి, భర్త వున్న గదిలోకి పోయి, సంగతి చెప్పి, "నా ఖర్మ ఇలా తగలబడింది! పిసినారితనానికీ ఒక హద్దంటూ వుండాలి," అన్నది.

దానికి రామశర్మ నవ్వి, "ఇందులో పిసినారితనం ఏమీ లేదు. వచ్చిన మూడు రూకల్లో, తలా ఒక రూక పంచుకుంటాం. నిన్ను డబ్బు తీసుకోకుండా అనుమతిస్తే, వాళ్ళకు రావలసిన చెరొక రూకా పోతుంది. అంతేకాక, రేపు వాళ్ళ భార్యలనూ ఇలాగే అనుమతిస్తే — నేను రెండు రూకలు నష్టపోవలసి వస్తుంది!" అన్నాడు.

తన భర్త నిజాయితీకీ, పొదుపరితనానికీ జానకీదేవి చాలా సంతోషించింది.

— మద్దూరు శ్రీనివాసులు






## 6

[రూపధరుడు ఒక ఏడాదిపాటు సుకేశినికి అతిథిగా ఉండి, తన అనుచరుల ప్రోద్బలం పైన ఇంటికి ప్రయాణంకట్టాడు. అతను సుకేశిని సలహాపై యమలోకానికి వెళ్లి, అక్కడ తలవని తలంపుగా తన తల్లియొక్క ప్రేతాత్మను కలుసుకుని, ఆమె ద్వారా తన కుటుంబ పరిస్థితుల గురించి తెలుసుకున్నాడు. —తరవాత]

రూపధరుడు తన తల్లితో మాట్లాడుతున్న సమయంలో ఇంకా అనేక ప్రేతాత్మలు బలి ఆరగించటానికిమందలుమందలుగావచ్చాయి. రూపధరుడు అందరి పరిచయమూ చేసుకు న్నాడు. ఆ వచ్చినవారిలో నవద్యోతుడితల్లీ, భువనసుందరితల్లీ కూడా ఉన్నారు.

బలులు పుచ్చుకున్న ప్రేతాత్మలు చాలా భాగం వెళ్లిపోయాయి. అంతలో అక్కడికి రారాజు ప్రేతాత్మ వచ్చింది. బలి ఆరగించగానే రారాజు రూపధరుణ్ణి గుర్తించి బావురుమని ఏడిచి, రూపధరుడికేసి చేతులు చాచాడు. కాని ప్రేతాత్మ బతికున్నవాణ్ణిఆలింగనం చేసు కోవటం సాధ్యంకాదు.

రూపధరుడు విస్మయంతో, "ప్రభూ, మీరిక్కడికి ఎప్పుడువచ్చారు? ఎలా వచ్చారు?" అని అడిగాడు.

"అజబలుడనే దుర్మార్గుడూ, నా భార్యా కలిసి నన్ను హత్యచేయటానికి కుట్రపన్ని,



"నీ భార్యమటుకు చాలా గొప్ప సాధ్వి. పాపం, నువ్వు యుద్ధానికి బయలుదేరేసరికి ఇంకా కొత్త పెళ్ళికూతురే, తొలిచూలు బాలింతరాలు! ఆ పిల్లవాడీపాటికి పెరిగి పెద్దవాడై ఉండాలి!" అన్నాడు రారాజు.

వారీ విధంగా మాట్లాడుకునే సమయంలో అక్కడికి వజ్రకాయుడూ, పితృకీర్తి ప్రేతాత్మల రూపంలో వచ్చారు. ట్రోయ్ యుద్ధంలో మరణించిన ఇతర గ్రీకువీరులు కూడా వచ్చారు.

వజ్రకాయుడు రూపధరుణ్ణి గుర్తించగానే పలకరించి, అనేక విషయాలు ముచ్చటించి, "నా కొడుకు క్షేమంగా ఉన్నాడా? అతను ఎలాటి యోధుడు?" అని అడిగాడు.

"నీ కుమారుడు నవయోధుడు చాలా పరాక్రమవంతుడు. నవద్యోతుడి తరవాతా, నా తరవాతా అతనిలాగా వ్యూహరచన చేసిన వాడు లేడు. అతను ఎందరినో పరాక్రమవంతులను సమయుద్ధంలో ఓడించాడు. కొయ్యగుర్రంలోకిఎక్కినవారిలోఅతనుఒకడే భయంతో వణకలేదు. మీదుమిక్కిలి, కత్తి చేతబట్టుకుని కూచుని, ట్రోయ్ మీద పడటానికి అనుజ్ఞ ఇవ్వమని నన్ను ఎంతగానో తొందరపెట్టాడు. యుద్ధంలోఎందరు చచ్చారో, ఎందరు గాయపడ్డారో చెప్పలేను, నవయోధుడి ఒక్కడిశరీరానికి మాత్రమే ఒక్కచిన్న గాయం కూడా తగలలేదు!" అన్నాడు రూపధరుడు.

ఈ మాటలు విని వజ్రకాయుడి ప్రేతాత్మ పరమానందం చెంది వెళ్ళిపోయింది. చూడ

నన్ను అతిథిగా ఆహ్వానించి, భోజనాల సమయంలో హత్యచేశారు. నాతోబాటు నా పరివారాన్నికూడాచంపేశారు. నువ్వుయుద్ధంలో అనేక రకాల ఘోరమైన చావులు చూసి వుంటావు; కానిభోజనాలముందు అంతమంది హత్యకావటంఊహించనుకూడాలేవు," అన్నాడు రారాజు.

"అవును, ప్రభూ! స్త్రీబుద్ధి ప్రళయాంతకమైనది. మీరు యుద్ధం నుంచి తిరిగి రాకపూర్వమే, మిమ్మల్ని హత్యచెయ్యటానికి మీ భార్య ఆలోచనచేసివుండాలి. ఆడదాన్ని నమ్మరాదు. భువనసుందరిని చూడరాదా? ఆమె కోసం ఎంతమంది బలి అయ్యారు!" అన్నాడు రూపధరుడు.

వలసిన వారందరినీ చూడటం పూర్తిచేసి రూపధరుడు తన నౌకకు తిరిగివచ్చి తిరుగు ప్రయాణంసాగించాడు. త్వరలోనే నౌక సుకేశిని ఉండే దీవిని చేరుకున్నది.

సుకేశిని రూపధరుణ్ణీ, అతని అనుచరులనూ ఆహ్వానిస్తూ, "మీరు మొత్తానికి భలేవాళ్లు! అందరూ యమలోకానికి ఒక్క మారే ప్రయాణం చేస్తారుగాని, మీరుమాత్రం రెండో ప్రయాణానికి అవకాశం అట్టేపెట్టుకున్నారు. ఇవాళ మీరు నా అతిథులుగా ఉండి తనివితీర తినండి. రేపు ఉదయం ఇక్కడి నుంచి బయలుదేరి పోదురుగాని!" అన్నది.



గ్రీకులు పగలల్లా తినటంలో గడిపారు. పొద్దు వాలి చీకటి పడగానే రూపధరుడు తప్ప మిగిలిన వారంతా నౌక వద్దకు వెళ్ళి, దాని సమీపాన ఇసకలో పడుకుని నిద్రపోయారు. రూపధరుడు సుకేశిని ఇంటనే ఉండి, యమలోకంలో తానుచూసిన వింతలన్నీ చెప్పాడు.

అంతా విని సుకేశిని ఇలా అన్నది : "అదంతా గతించిన విషయం. ఇక జరగవలసిన దాన్ని గురించి నేను చెప్పేది శ్రద్ధగా విను. నీకు ప్రయాణంలో మొట్టమొదటగా నాగకన్యకలు తగులుతారు. వారి గొంతులకు సమ్మోహన శక్తి ఉన్నది. వారి పిలుపు విన్న వారికి ఆయువు మూడినట్టే! అందుచేత వారుండే దీవి రాకమునుపే నీ అనుచరులందరి చెవులలోనూ మైనం పట్టేసి నాగకన్యకల పాటలు వినిపించకుండాచెయ్యి. నీకు వారి పాటలు వినాలని కోరిక ఉన్నట్టయితే, నీ అనుచరులు నిన్ను తెరచాప స్తంభానికేసి గట్టిగా బంధించాలి. నువ్వు ఎంత కేకలు పెట్టినా కట్లు ఊడదీయవద్దని నీ అనుచరులతో గట్టిగా ముందే చెప్పి ఉంచు. అప్పుడు నువ్వు వారి పాటలు వినవచ్చు; అందువల్ల నీకు ప్రమాదం ఉండదు. నాగకన్యకలుండే దీవి దాటి, వారి గొంతులు వినిపించకుండా పోయాక నీకు సముద్రంమీద రెండు మార్గాలు తగులుతాయి.వాటిలో నువ్వు ఏమార్గం తీసుకుంటావో నేను చెప్పలేను.ఒకమార్గం రెండు నిటారుకొండల మధ్యగా పోతుంది.ఆ కొండల మధ్యకు ఒక చిన్న పక్షి వచ్చినా సరే అవి

ఒకదానితో ఒకటి ఢీకొట్టి చంపేస్తాయి. అవి కదిలే కొండలు. వాటి మధ్యకు వెళ్ళి నాశనం కాని నౌక అంటూ ఉండదు. ఇక నీ రెండవ మార్గం విధ్వంసినీ పర్వతంపక్కగా ఉంటుంది. ఈ పర్వతం చాలా ఎత్తయినది. దీని శిఖరం అన్నికాలాలలోనూ మేఘాలు కప్పి ఉంటుంది. అందుచేత దానిని చూసిన వారెవ్వరూలేరు. ఆపర్వత శిఖరాన్ని ఎక్కినవారుకూడా ఎవరూ లేరు. ఎందుచేతనంటే ఆ పర్వతం నున్నగా, కాలు పెడితే జారిపోతూ ఉంటుంది. ఆ పర్వతం చరియలో ఒక గుహ ఉన్నది. అది పడమటి వేపు చూస్తూ ఉంటుంది. ఆ గుహలో విధ్వంసిని అనే రాక్షసి ఉన్నది. ఆమె అప్పుడే పుట్టిన కుక్కపిల్లలాగా కుంయికుంయిమని మొరుగుతుంది. అయినా ఆ మొరుగుడు భయం కలిగిస్తుంది. ఆ రాక్షసికి పన్నెండు కాళ్లూ, ఆరు తలలూ ఉన్నాయి. ఆమెకు గల ఆరు మెడలూ అతిపొడుగైనవి. ఆమె ఉండే గుహ సముద్రమట్టానికి ఎంతో ఎత్తున వుంటుంది. ఎంత గొప్ప విలుకాడు కూడా, అంత ఎత్తు బాణం వెయ్యలేడు. అయినప్పటికీ విధ్వంసిని నడుము పైభాగం గుహలో నుంచి బయటికి పెట్టి, సముద్రంలో గల చేపలను తన నోళ్లతో అందుకోగలదు. ఆమెకు అందుబాటులోకి వెళ్లి ప్రాణాలతో బయటపడిన నావికుడు ఇంతవరకు లేడు. ఆకొండకు బాణంవేటు దూరంలో ఒక సుడిగుండం ఉన్నది. ఈ సుడిగుండంలో చిక్కుకున్న నౌక నాశనం కాకుండా చేసే శక్తి ఈశ్వరుడికి కూడా లేదు. నీ నౌకను ఈ



సుడిగుండం మీదుగా తీసుకుపోవటం కంటె, విధ్వంసినీ పర్వతం పక్కగా తీసుకుపోవటం చాలా క్షేమం. నౌక వేగంగా పోయిన పక్షంలో, విధ్వంసిని తన ఆరు నోళ్లతోనూ ఆరుగుర్ని పట్టుకున్నప్పటికీ మిగిలిన వాళ్లు దక్కుతారు.

"తరవాతనువ్వు త్రినాసియా దీవి చేరుకుంటావు. అక్కడ సూర్యభగవానుడి ఆవుల మందలూ, గొర్రెల మందలూ వుంటాయి. మందకుయాభైచొప్పునఏడుఆవులమందలూ, ఏడు గొర్రెల మందలూ వుంటాయి. వాటిని సూర్యుడి కుమార్తె లిద్దరూ కాస్తూ వుంటారు. ఆ మందలకు చావూ, పుట్టుకాలేదు. నువ్వుగాని, నీఅనుచరులుగాని ఆ మందల జోలికి పోవద్దు. అలా పోయినట్టయితే నీ నౌకా, అనుచరులూ నాశనమైపోతారు. నీకు ఎలాగూ కష్టాలు తప్పవు. అందుచేత వాటిని అనవసరంగా పెంచుకోకు."

సుకేశిని ఇలా చెప్పిన అనంతరం తూర్పు తెల్లవారింది. రూపధరుడు తన నౌకవద్దకు తిరిగివచ్చి తన అనుచరులను లేపాడు. త్వరలోనే నావికులు లంగరు ఎత్తి నౌకను బయలుదేరదీశారు. సుకేశిని అనుగ్రహం వల్ల ఆ సమయంలో అనుకూలమైన గాలి వీచి తెరచాపను నించింది.

మొట్టమొదట రాబోయే ప్రమాదం నాగకన్యకల నుంచి, అందుచేత రూపధరుడు తన అనుచరులతో సుకేశిని చెప్పిన విషయాలన్నీ చెప్పి, వారందరి చెవులలోనూ మైనం కుక్కి వాళ్లను చెవిటివాళ్లుగాచేసేశాడు. తర





వాత వారు రూపధరుణ్ణి తెరచాపస్తంభాని కేసి మోకుతో కట్టేశారు. "నేను కట్లు విడిపించు కోవటానికి యత్నిస్తేమరింత గట్టిగా కట్టండి!" అని అతను వారితో ముందుగానే చెప్పాడు.

నాగకన్యకలు తమదీవినుంచి రూపధరుడి నౌకనుచూసి గొంతులెత్తి పాడసాగారు. వారు రూపధరుణ్ణి పేరుపెట్టి పిలిచి,తియ్యని తమ పాటలు విని మరీ వెళ్లమన్నారు. వారి పాట వింటున్నకొద్దీ రూపధరుడికి ఇంకా వినాలని పించింది. తన కట్లు విప్పమని అతను తన అనుచరులను బతిమాలాడు. అతని వాలకం చూసి వారు అతన్ని మరింత గట్టిగా కట్టారు.

కొద్దిసేపట్లో నౌక దూరం వెళ్ళిపోయింది. నాగకన్యకల గొంతులు ఇక వినిపించటం లేదు. అప్పుడు రూపధరుడి అనుచరులు తమ చెవులలో పెట్టుకున్న మైనం తీసేశారు, రూపధరుడి కట్లు విప్పేశారు. అంతలోనే రూపధరుడికి అంతదూరాన గుండ్రగా తిరుగుతూ బ్రహ్మాండమైన అల ఒకటి కనిపించింది. అదేసుడిగుండం.దాన్ని చూసీ చూడటంతోనే రూపధరుడి అనుచరులు హడలిపోయారు.

"మీరేమీ భయపడకండి. ఫాలలోచనుడి బారి పడినదానికంటె ఇదేమంత ప్రమాదం కాదు. నౌకను ఆ కనపడే కొండసమీపంగా నడపండి!" అన్నాడు రూపధరుడు.

అతను తన అనుచరులతో ఆ కొండ గుహలో ఉండే విధ్వంసిని గురించి చెప్ప లేదు. చెబితే వారు బెంబేలెత్తి తెడ్లు అవతల పారేసిఉండేవారే.రూపధరుడు మాత్రం కొండ కేసి పరీక్షగా చూశాడు. మబ్బులు ఆవరించి ఉండటంచేతఅతనికిరాక్షసిఉండే గుహగాని, రాక్షసి జాడగాని కనిపించనేలేదు. మిగిలినవారి కళ్లుమాత్రం సుడిగుండం మీదే ఉన్నాయి.

ఇంతలోరాక్షసి ఆరుతలలూ చాచి రూపధరుడి అనుచరులను ఆరుగురిని పట్టుకుని తన గుహకేసి లాగేసుకున్నది. నౌక కొండను దాటి ముందుకు వెళ్ళిపోయింది.

రూపధరుడుఅంతదూరాన మనోహరమైన దీవిని చూశాడు.ఆదీవి నుంచిఆవుల అంబారవాలూ, గొర్రెల అరుపులూ వినవస్తున్నాయి. అదే సూర్యభగవానుడి మందలుండే దీవి.

ఈ సంగతి గ్రహించగానే రూపధరుడికి సాంకేతికుడు చేసిన హెచ్చరికా, సుకేశిని చేసినహెచ్చరికా స్ఫురణకు వచ్చాయి. అతను భయపడుతూ తన అనుచరులతో ఇలా అన్నాడు: "మిత్రులారా, ఈ మనోహరమైన దీవి మీద మనకు అడుగుపెట్టే ప్రాప్తం లేదు. మీరందరూ ఎంతో అలసటచెంది, విశ్రాంతి కోసం తహతహలాడిపోతున్నారని నాకు తెలుసు. కాని ఈ దీవి మీద అడుగు పెడితేఘోరప్రమాదం తప్పదని నాకు సాంకేతికుడూ, సుకేశినీ హెచ్చరిక చేశారు. కనుక నౌకను దీవికి ఎడంగా నడపండి."

అతని మాటలు విని అతని అనుచరులు నీరుకారిపోయారు. మాయావి మటుకు మండిపడిపోతూ, "రూపధరా, నువ్వు మనిషివి కావు, రాయివి! నీకు విసుగూ విరామమూ అవసరం లేదు. ఇరుగో నీ మనుషులు, నిద్రహారాలు లేక చావటానికిసిద్ధంగా వున్నారు;కాని వీరిని తీరానికి పోవద్దంటావు, వంట చేసుకుని కడుపునిండా తినవద్దంటావు! రాత్రి పడబోతున్నది. ఒక రాత్రివేళ ఏ ఉప్పెన వచ్చినా రావచ్చు.ఆఉప్పెనలో మనంనడిసముద్రంలో వుంటే ఏంకాను? నూరు ఆరయేదిగాక, ఈ రాత్రికి ఈతీరాన విశ్రాంతి తీసుకుని వంటలు చేసుకోక తప్పదు. కావలిస్తే రేపు తెల్లవారగానేమళ్లీబయలుదేరుదాం!"అన్నాడు.

ఈ మాటలకు మిగిలినవారంతా గట్టిగా హర్షించారు. విధివ్రాత తప్పించుకోవటం సాధ్యంకాదని రూపధరుడు గ్రహించాడు. అతను మాయావితో, "మీరంతా ఒకటైతే నేను చేయగలిగినదేమీ లేదు. కాని మీరంతా ఒక ప్రమాణం చెయ్యాలి. మనకు ఆవుల మంద తగిలినా,గొర్రెల మందతగిలినా వాటి జోలికి పోగూడదు. మనలో ఏ ఒకరు కూడా ఒక్క ఆవునుగాని, ఒక్క గొర్రెను గాని చంపటానికి ప్రయత్నించకూడదు. మనకు సుకేశిని ఇచ్చిన ఆహారం మినహాగా ఇంకేమీ ముట్టవద్దు.ఆప్రకారం మీరంతా ప్రమాణాలు చేశారంటే ఈ త్రినాసియా దీవి మీద అడుగు పెట్టటానికి నేను అంగీకరిస్తాను!" అన్నాడు.

మిగిలినవారంతా ఆప్రకారమే ప్రమాణాలు చేశారు. —(ఇంకావుంది)



# దానగుణం

త్రిలింగదేశాన్ని పాలించే విశాఖదత్తుడికి దానగుణమెక్కువ. ఆ కారణం వల్ల, రాజ్యానికి వచ్చే ఆదాయంలో చాలా భాగం ఖర్చు కావడం, ప్రధానమంత్రికి ఇష్టం లేదు. సమయం చూసి రాజుకు సలహా ఇవ్వాలనుకున్నాడాయన.

ఒకరోజు, ఎంతో పేదరాలుగా వున్న ఒక యువతి, రాజసభలోకి ప్రవేశించి, "మహారాజా! రెండేళ్ళ క్రితం ఒక ప్రమాదంలో, నా భర్త పోవడంతో దిక్కులేనిదాన్ని అయ్యాను. ఉన్న ఒకే కుమారుడు జబ్బుతో మంచం పట్టాడు. వాడి వైద్యానికి తమరు ధన సహాయం చేస్తే, మీ మేలు జన్మలో మరిచిపోలేను," అంటూ భోరున ఏడ్వసాగింది.

ఆ మాటలకు చలించిన విశాఖదత్తుడు, ఆమెకు వంద వరహాలు దానమిచ్చి సాగనంపాడు.

మర్నాడు, ఆ యువతిని రాజభటులు బంధించి తెచ్చి, రాజుతో, "మహారాజా! ఈమె పెద్ద మోసగత్తె! మంత్రిగారు గూఢచారిని నియమించటంతో, నిజం తెలిసిపోయింది. ఈమె భర్తా, కొడుకూ నిక్షేపంలా వున్నారు," అన్నారు.

అప్పుడు, మంత్రి కల్పించుకుని, "చూశారా, మహారాజా! మీ దానగుణాన్ని ఆసరాగా తీసుకుని, ఎలా మోసం చేసిందో," అన్నాడు.

రాజు, ఆ యువతికేసి పరీక్షగా చూసి, "మహామంత్రీ! లేని కష్టాలను వున్నట్లుగా ఊహించి, కంట తడిపెట్టడం మామూలు వ్యక్తులకు సాధ్యమయ్యే పని కాదు. ఈమెలో గొప్ప నటీమణి కాగల లక్షణాలు కనబడుతున్నవి. కళాకారుల్ని సన్మానించడం కూడా, మన బాధ్యతే! మరొక వంద వరహాలిచ్చి, ఈమెను సన్మానించండి," అన్నాడు.

— బి. రఘురామరాజు





# రాక్షసికైవల్యం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, పూనిన కార్యం సాధించి తీరాలన్న నీపట్టుదలా, దానికి దీటైన ధైర్య సాహసాలూ చూస్తూంటే, నాకెంతో ముచ్చట కలుగుతున్నది. అయితే, నిన్ను అతి కఠోరమైన ఈ పనికి పురిగొల్పినవాడుమాంత్రికుడా లేక మునిలాంటి వాడా అన్న శంక నన్ను బాధిస్తున్నది. ఎందుకంటే — మాంత్రికులు క్షుద్రదేవతారాధకులు. ఒక్కొక్క సారి తాము స్వయంగా సాధించలేని కార్యాలకు, అమాయకులను బలిపశువుల్ని చేస్తూంటారు. మునులు అలా కాక, సంకల్పిస్తే, తమ తపోశక్తితో దుష్టులైన వారికి కూడా పుణ్యలోకాలు ప్రసాదించగలరు. కాని, ఒక్కొక్కసారి వారు సంకల్పించిన దానికి భిన్నంగా కార్యసాఫల్యం జరుగుతుంటుంది.

**బేతాళ కథలు**



ఇందుకు ఉదాహరణగా, నికుంభికఅనే ఒక రాక్షసి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం దండకారణ్యంలో, నికుంభిక అనే రాక్షసి వుండేది. నరమాంసం దానికి అత్యంత ప్రీతి పాత్రం. ఒక విశాలమైన గుహ దాని నివాసం. ఆ ప్రాంతానికి ఎవరైనా ప్రయాణీకులు రావడం జరిగితే, అది, 'ఆహా, నరవాసన!' అనుకుంటూ బయటకు వచ్చి, వాళ్ళను విరుచుకు తినేది.

నికుంభిక ఒకసారి గుహలో నిద్రపోతూండగా, ఒక పెళ్ళి బృందం అటుగా ప్రయాణం చేసింది. అది వెంటనే ఒళ్ళు విరుచుకుని లేచి, గుహనుంచి బయటకువచ్చింది. దాన్ని చూసిన పెళ్ళి బృందంలోని చాలామంది, భయకంపితులై పారిపోయారు. దొరికిన కొందరిని అది తినివేసింది.

ఆ తర్వాత నికుంభిక, ఒకవారం రోజుల పాటు ఒళ్ళు తెలియకుండా నిద్రపోయింది. మెలకువ రాగానే ఎక్కడలేని ఆకలితో, అది అడవిలో తిరగసాగింది. ఒక చోట దానికి వినయశీలి అనే ముని, ఒక చెట్టు కింద తపస్సు చేసుకుంటూ కనిపించాడు.

నికుంభిక తనకు ఆహారం దొరికినందుకు సంతోషిస్తూ, మునిని సమీపించ బోయేంతలో, ఆయన చుట్టూ అగ్ని జ్వాలలు వలయాకారంలో కనిపించాయి. అంతలో ముని కళ్ళు తెరిచి, "నికుంభికా! మనుషులను చంపి తినే హేయమైన జన్మ నుంచి విముక్తి చెందే ప్రయత్నం చేయి. రేపు పరమ పవిత్రమైన శివరాత్రి. ఏ మనిషినీ చంపి తినకుండా, భగవన్నామస్మరణలో కాలంగడుపు. ఒక మానవుడి వల్ల, నీకు అన్ని పాపాలనూ హరించే గంగాజలం లభిస్తుంది. అది సేవించగానే, నీకు ఈ రాక్షసిజన్మ నుంచి విముక్తి కలుగుతుంది," అని చెప్పాడు.

నికుంభిక, మునికి నమస్కరించి, "మహానుభావా! తప్పక మీరు చెప్పినట్లు చేస్తాను," అని అక్కడి నుంచి, తన గుహ చేరి ఆకలికి తల్లడిల్లిపోసాగింది.

మర్నాడు శివరాత్రి. నాగభైరవుడనే గజదొంగ అటుగా గుర్రం మీద రావడం చూసి,

నికుంభిక ఇకఆకలికి ఓర్చలేక,గుహ నుంచి బయటకు వచ్చి వాడిని గుప్పెటలో పడిసి పట్టుకున్నది.

నాగభైరవుడు ప్రాణభయంతో వణికి పోతూ, "నన్ను చంపకు!" అని వేడుకున్నాడు.

వాడిలా అనగానే రాక్షసికి, క్రితం రోజు ముని చెప్పిన మాటలు గుర్తుకువచ్చి, నాగ భైరవుణ్ణి నేలకు జార్చి, "ఎవడివిరా నువ్వు? నిజం చెప్పు!" అంటూ గద్దించింది.

దానికి నాగభైరవుడు, "నేను గజదొంగగా పేరు మోసిన వాణ్ణి. నా పేరునాగభైరవుడు. ఇంతకు ముందే ఒక పెళ్ళి వారి ఇంటపడి దొంగిలించిన ఆభరణాలతో పారిపోయివస్తు న్నాను. అవి నీకు ఇస్తాను. నన్ను చంపకుండా వదిలిపెట్టు!" అన్నాడు ప్రాథేయపడుతూ.



నికుంభిక,దొంగ మాటలకు పెద్దగా నవ్వి, "ఓరీ, నరాధమా! నీ నగలు నాకెందుకు?" అని ముని హితబోధ జ్ఞాపకానికి వచ్చినా, ఆకలికి తాళలేక వాణ్ణి తినివేసింది. అంతలో దానికి కొంత దూరంలో ఇంకొక మనిషి కని పించాడు. రాక్షసి చప్పున ఒక మహావృక్షం చాటుకుపోయి,వాడు దగ్గరకు రాగానే, "ఎవ డివిరా నువ్వు?" అని హుంకరించింది.

రాక్షసిని చూస్తూనే వాడు నిలువెల్లా వణికిపోతూ, "నా పేరు వీరదాసు. కళింగ రాజు కొలువులో వంటవాడిగా వుండేవాణ్ణి. హఠాత్తుగా మహారాజునన్ను పనిలో నుంచి తొలగించి అడవి పాలు చేశారు," అన్నాడు.

నికుంభిక వాడికేసికసిగా చూస్తూ, "ఒట్టినే రాజు నిన్నెందుకు పని నుంచి తొలగిస్తాడు? నువ్వేదో నేరంచేసి వుంటావు. నిజం చెప్పు!" అన్నది.

వీరదాసు బొంగురు పోయిన కంఠస్వ రంతో, "మహారాక్షసీమణీ! నిజం చెపుతాను; నన్ను చంపకుండా విడిచిపెట్టు. పొరుగు రాజు నాకు ధనాశ చూపి, మా రాజు ఆహా రంలో విషం కలపమని కబురు చేశాడు. అలా చేయబోయి రాజుకు దొరికిపోయాను," అన్నాడు.

వాడి జవాబుకు నికుంభిక వికవికమంటూ నవ్వి,"రాజు నుంచి పారిపోయి,నావాత పడ్డా వన్నమాట!" అంటూ వాణ్ణి నోట పెట్టుకున్నది.



ఆ తర్వాత,ఇంకా ఆకలి చల్లారని రాక్షసి, గుహలోపల కూర్చుని కునికిపాట్లు పడుతూం డగా, శివకాంతుడనే యువకుడు అటుగా వచ్చాడు. వాణ్ణి చూస్తూనే అది లేచి నిలబడి, నాలుగడుగులు వేసి, "ఒరే, మానవాధమా! ఇక్కడితో నీ ప్రయాణం ముగిసిపోయింది, ఆగు," అన్నది భీకరంగా.

శివకాంతుడు, రాక్షసిని చూసి ఏమాత్రం భయపడకుండా,"ఎందుకు నన్ను ఆగమంటు న్నావు?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు నికుంభిక పొట్టచెక్కలయ్యేలా నవ్వి, "నిన్ను ఎందుకు ఆగమన్నానో తెలియ నంత వెర్రివాడివా? ఉదయం నుంచి ఇద్దర్ని చంపితిన్నా, ఏదో ఫలహారం చేసినట్లున్నదే తప్ప, ఆకలి తీరలేదు. అందుకే నిన్ను ఆగ మన్నాను," అన్నది.

దానికిశివకాంతుడునిర్భయంగా,"అయితే, నన్ను చంపితిని నీఆకలి తీర్చుకో.నా శరీరం ఒకరి ఆకలిని చల్లార్చగలిగితే, నాకంత కంటే ఆనందమేమున్నది!" అన్నాడు.

ఆ మాటలకు నికుంభిక ఆశ్చర్యపడుతూ, "చావంటేనీకు భయంలేదా?" అని అడిగింది.

"భయమెందుకు? ప్రతిమనిషీ ఏదో ఒక నాడు మరణిస్తాడు. ఏ జబ్బో చేసి మంచాన పడి మరణించడంకంటే, నీకు ఆహారమై నీ ఆకలి తీర్చడంఉత్తమంకదా?"అన్నాడు శివ కాంతుడు.

ఇది విన్న నికుంభిక, ఇతడెవడో సామాన్య మానవుడు కాదని అనుకుని, అయినా ఒక వేళ మేకపోతుగాంభీర్యం ప్రదర్శిస్తున్నాడేమో అన్న సంశయంతో, శివకాంతుణ్ణి ఎడమ చేతితో పైకెత్తింది. అప్పుడు శివకాంతుడు, "ఒక్కక్షణం ఆగు! నా భార్య ఎంతో కాలంగా అస్వస్థతతో మంచం పట్టివుంది.ఆమె కోసం అష్టకష్టాలు పడి కాశీకి పోయి గంగాజలం తీసుకువస్తున్నాను. ఇది ఎలాగూ ఆమెకు చేరదు; నువ్వు సేవించు. ఈసారైనా నీకు ఉత్తమజన్మ లభిస్తుంది!" అన్నాడు.

ఆ వెంటనే నికుంభిక, శివకాంతుణ్ణి కిందికి దించి "మహానుభావా! ఆ గంగా జలాన్ని,నీభార్యకే అందజేయి,"అంటూ అత డికి సాగిలబడి నమస్కరించింది.

శివకాంతుడి పాదాలు తాకిన మరుక్షణం, రాక్షసి విగత జీవురాలైంది. దానికి కైవల్య ప్రాప్తి లభించింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ముని వినయశీలుడు, నికుంభికకు శివరాత్రి నాడు నరుల నెవరినీ చంపకుండా భగవన్నామస్మ రణలో వుండమనీ, ఒక మానవుడి వల్ల లభించే పవిత్ర గంగాజలం సేవించిన కార ణంగా, రాక్షసిజన్మ నుంచి విముక్తి కలుగు తుందనీ చెప్పాడుగదా? కానీ, నికుంభిక ఆనాడు ఇద్దరు మనుష్యులను చంపితిన్నది. శివకాంతుణ్ణి చంపకవదిలినా, అతడిస్తానన్న గంగాజలం తీసుకోలేదు. అయినా, దానికి కైవల్యం లభించింది. ఇదెలా సంభవమైంది? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నికుంభిక చంపిన ఇద్దరిలో ఒకడు గజదొంగ.మరొకడు స్వామి ద్రోహి. ఇతరులను దోచుకునేవాడు, ప్రభువు ప్రాణానికే ముప్పు కలిగించేవాడు, నరరూప రాక్షసులవుతారుగాని, నరులుకారు. అందు వల్లనే, శివరాత్రి పర్వదినాన వాళ్ళను చంపి తిన్నా, దానికెలాంటి పాపమూ అంటలేదు. ఇక, గంగాజలం సేవించకపోయినా, రాక్షసికి కైవల్య ప్రాప్తి కలగడానికి కారణం — చావు సమీపించనున్న క్షణాన కూడా, శివకాంతుడు, నికుంభికను ద్వేషించక, దానికి వచ్చే జన్మలో నైనా ఉత్తమ జన్మలభించాలని కోరుకుంటూ — భార్యకోసం తెచ్చిన గంగాజలాన్ని ఇవ్వ బోయాడు. అటువంటి త్యాగధనులు, దైవ సమానులు.వారి పాదస్పర్శకు, పవిత్ర గంగా జలాన్ని మించిన శక్తి వుంటుంది. నికుంభి కకు, మునిచెప్పిన మాటలు గుర్తున్నా—గొప్ప త్యాగబుద్ధితో శివకాంతుడివ్వ జూపిన గంగా జలాన్ని స్వీకరించక, నీ భార్యకే అందచేయ మన్నది. ఈ కారణాలవల్లనే, రాక్షసి కైవల్య ప్రాప్తికి అర్హురాలైంది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : ఎన్. శివనాగేశ్వరరావు రచన]





# ఎవరు గొప్ప!

ఒకసారి, ధర్మవరం జమీందారు రాజశేఖరుడు, తన దివానును జమీ గ్రామాలన్నీ తిరిగి, రావలసిన పన్నులు వసూలు చేసి, ప్రజల పరిస్థితి ఎలా వున్నదో తెలుసుకురమ్మని పంపాడు.

దివాను ఇద్దరు నౌకర్లను వెంటబెట్టుకుని, నెలరోజుల పాటు చాలా గ్రామాల వెంట తిరిగి, బకాయిపడిన పన్నులతో పాటు, ప్రజల అవసరాలూ, ఇబ్బందులూ తెలుసుకున్నాడు. ఈ సమయంలో ఆయనకు, ఏమాత్రం రహదారీ సౌకర్యాలు లేని మాయవరం అనే గ్రామ ప్రజలు చాలా అమాయకులుగా కనిపించారు. వాళ్ళకు, తాము జమీందారుకు ఎంతో కొంత పన్నులు చెల్లించాలని కూడా తెలియదు.

దివాను ధర్మవరానికి తిరిగి వచ్చాక, జమీందారుకు గ్రామాల స్థితిగతులన్నీ వివరించి, "అయ్యా, మన జమీ గ్రామాల్లో మాయవరం అనేది చాలా వింత గ్రామం. అక్కడి వాళ్ళందరూ పరమ అమాయకులు. అలాంటి వాళ్ళను, నేనెక్కడా చూడలేదు," అంటూ, వాళ్ళ అమాయకత్వానికి కొన్ని ఉదాహరణలు చెప్పాడు.

ఆ సమయంలో, దేశమంతటా తార్కికోపన్యాసాలిస్తూ పర్యటిస్తున్న తర్కానందస్వామి, జమీందారు పక్కనే కూర్చుని వున్నాడు.

జమీందారుతో పాటు, మాయవరం గ్రామ ప్రజల అమాయకత్వాన్ని గురించి విన్న తర్కానందస్వామి, ఈ మాటలకు చిన్నగా నవ్వి, "మనుషులు అమాయకులుగా ప్రవర్తించడానికి ముఖ్య కారణం, వారిలో తార్కికంగా ఆలోచించే శక్తి కొరవడడం. ఇది ఒక రకమైన వ్యాధి. అలాంటి వాళ్ళకు తార్కిక దృష్టి అలవరచాలి," అన్నాడు.

"స్వామీ! ఇది సాధ్యమేనంటారా?" అని అడిగాడు జమీందారు సంశయిస్తూనే. "ఎందుకు సాధ్యం కాదు! చరాచర జగత్తంతా

రామవరపు గణేశ్వరరావు

తర్కభూయిష్ఠం. సూర్యచంద్రులూ, నక్ష త్రాలూ అన్నీ కూడా తర్కసూత్రాలకు అనుగుణంగానే పరి భ్రమిస్తున్నవి. వేయేల ఆ మాయవర గ్రామ ప్రాంతాలెరిగిన నౌకరొకణ్ణి పంపండి. నేను నా ఇద్దరు శిష్యులతో అక్కడికి వెళ్ళి, కొద్ది రోజుల్లో ఆ గ్రామవాసుల్ని తెలివితేటల్లో, వివేకంలో శుక్రాచార్య, బృహస్పతీ సమానుల్ని చేస్తాను," అన్నాడు.

జమీందారు ఇందుకు సంతోషంగా అంగీకరించాడు.

తర్కానందస్వామి జమీందారు వద్ద సెలవు తీసుకుని, కొన్ని రోజుల తర్వాత మాయవరం గ్రామం చేరాడు.



గ్రామం చూడముచ్చటగా వున్నది. దూరాన సముద్ర ఘోష. ఎక్కడ చూసినా పంట పొలాలు. గ్రామం చుట్టూ ఫలవృక్షాల తోటలు, కనుచూపు మేరలో చిట్టడివి. ఆ వెనక చిన్నా, పెద్ద కొండల సమూహం.

ఇది చూసిన తర్కానందస్వామి శిష్యులు, "గురువర్యా! ఇంత సుందర ప్రదేశంలో వున్న ప్రజలు అమాయకులంటే నమ్మశక్యంగా లేదు!" అన్నారు.

ఇందుకు తర్కానందస్వామి చిరాకుపడుతూ, "మీరు దివాను అబద్ధాలు చెప్పాడనుకుంటున్నారా, పొరబాటు. సరే, మీరు పోయి ప్రజలందర్నీ, గ్రామంనడిబొడ్డున వున్న రావి చెట్టు దగ్గరకు రావలసిందిగా చెప్పండి," అన్నాడు.

శిష్యులిద్దరూ ఇంటింటికీ వెళ్ళి, తమ గురువు తర్కానందస్వామి హిమాలయాల్లో ఇరవై ఏళ్ళూ, వింధ్య పర్వతాల్లో పదేళ్ళూ తపస్సు చేసి, తర్కర్షి అనే ఋషి పుంగవుడి నుంచి తర్కశాస్త్ర సారం గ్రహించారనీ, వారివ్వబోయే తర్కోపన్యాసం వినేందుకు, అందరూ రావిచెట్టు దగ్గరకు రావాలనీ చెప్పారు.

వాళ్ళు ఈ తర్కోపన్యాసం ఏమిటా అని ఆశ్చర్యపడుతూ, అందరూ రావిచెట్టు దగ్గర చేరారు.

అంతమంది రావడం చూసి సంతోషిస్తూ, తర్కానందస్వామి రావిచెట్టు బండ మీద కుదురుగా కూర్చుని, ఏదో చెప్పబోయేంతలో శిష్యుడొకడు రహస్యంగా, "గురువర్యా! వీళ్ళ

ముఖాలు చూస్తూంటే కొందరు దుష్టులూ, పొగరుబోతులూలాగా కనిపిస్తున్నారు. తమరు చెప్పేది నచ్చకపోతే, మనను వెంటబడి తరిమే ప్రమాదమున్నది. అందువల్ల, తమరు క్షమాగుణం, క్షమాభిక్షల గురించి తర్కోపన్యా సంప్రారంభించండి," అన్నాడు.

"మేలైన సూచన, శిష్యా! నువ్వు ఏదో ఒక నాడు నా ప్రధాన శిష్యుడివి కాదగినవాడివి," అంటూ తర్కానందస్వామి శిష్యుణ్ణి మెచ్చుకుని ప్రజలతో, "అన్ని జన్మలలోనూ ఉత్తమమైనది మానవజన్మ. అన్ని గుణాల్లోనూ ఉత్తమమైనది క్షమాగుణం, అదే క్షమాభిక్ష! దానిని మించినది మరిలేదు," అని, ఉదాహరణలతో కొంతసేపు మాట్లాడి, "విన్నారుగదా! ఇప్పుడు సందేహాలేమైనా వుంటే, అడగండి, తీర్చగలను," అన్నాడు.

అప్పుడు జనంలో నుంచి ఒకడు లేచి, "మా ఇంట్లో దొంగతనం చేయబోతూంటే, ఒకణ్ణి పట్టుకున్నాను. కానీ, ఆ దొంగను క్షమించి వదిలేశాను. నా క్షమాగుణం గొప్పదే గదా, స్వామీ?" అని అడిగాడు.

ఇంతలో మరొకడు లేచి, "మా ఇంట్లో ఒక రోజు దొంగతనం చేయబోతున్నవాడిని, నేను కూడా ఒకసారి పట్టుకున్నాను. వాణ్ణి కొట్టా తిట్టలేదు సరికదా — అంతవరకూ వాడు దొంగిలించిన వాటిని తీసుకువెళ్ళమని చెప్పాను. నా క్షమా గుణం గొప్పదే గదా, స్వామీ?" అన్నాడు.

వాడు మాట్లాడడం ముగించగానే మరొకడు లేచి, "అలాంటి పరిస్థితిలోనే, నాకు దొరికిన దొంగకు, నేనెలాంటి గౌరవ మర్యాదలిచ్చానంటే - వాడికి కావలసినవన్నీ నిస్సంకోచంగా తీసుకువెళ్ళమని, ఆనందంగా అనుమతించాను. మరి, నా క్షమాగుణం ఆ ఇద్దరి కన్న గొప్పది కదా, స్వామీ?" అన్నాడు.

దానికి తర్కానందస్వామి, తల అడ్డంగా వూపుతూ, "మీ అందరి క్షమాగుణం కన్న గొప్పది దొంగల క్షమాగుణం! అమాయక చక్రవర్తులైన మీకు, మరే హానీ తలపెట్టకుండా వదలడం సామాన్య విషయం కాదు!" అంటూ లేచి, శిష్యులు వెంటరాగా తిరిగి చూడకుండా గ్రామం వదిలివెళ్ళాడు.






ఖంబాట్ సింధుశాఖ ముఖద్వారంలో, ఒక సన్నటి కాలువ అందమైన చిన్న డయ్యూద్వీపాన్ని గుజరాత్ ప్రధాన భూమితో కలుపుతున్నది. సంస్కృత ద్వీప శబ్దం నుంచి డయ్యూ అనే పేరు వచ్చింది. 40 చ.కి.మీ విస్తీర్ణమేగల డయ్యూ ద్వీపం ఒకప్పుడు సంపన్నమయిన ఓడరేవుగా వెలు గొందింది. 1593వ సం॥లో పోర్చుగీసులు దీనిని ఆక్రమించారు. 1961వ సం॥లో ఇది మన దేశంలో అంతర్భాగమయింది. ఖంబాట్ సింధుశాఖకు తూర్పుగా ఉన్న డామన్‌తో పాటు ఇది ఇప్పుడు కేంద్ర పాలిత ప్రాంతంగా

# సముద్రతీర ప్రయాణాలు : 2
# ఖంబాట్ సింధుశాఖ

రచన : మీరా నాయర్ ❖ చిత్రాలు : గోపకుమార్

ఉంటున్నది. ఈ ద్వీపంలో ఆకర్షణీయమైన భవనం డయ్యూ కోట. దీనిని పోర్చుగీసులు నిర్మించారు. కోటకు మూడు వైపులా సముద్రం, ఒక వైపున అంటే భూమి వైపున అగడ్త ఉన్నాయి. కోటలో ఎత్తయిన బురుజు ఇప్పుడు 'లైట్ హౌస్'గా ఉంటున్నది. ఈ దీపకాంతి ఆకాశం నిర్మలంగా ఉన్న



రాత్రులలో ప్రధాన భూమికి కనిపిస్తుంది. ఓడలను పగులగొట్టే అతి పెద్ద రేవు భావనగర్‌కు 40 కి.మీ. దూరంలో ఉన్నది. దీనిని 'అలాంగ్ షిప్ బ్రేకింగ్ యార్డ్'అనిఅంటారు. 1983వసం॥ లో దీనిని నిర్మించారు. ఓడలను కొన్నేళ్ళు ఉపయోగించిన తరవాత భద్రత దృష్ట్యా పగలగొడతారు. అటువంటి పాత ఓడలను ప్రపంచంలోని వివిధ దేశాల నుంచి ఇక్కడికి చేరుస్తారు. ఇక్కడి అలల చలనం ఓడలను తీరానికి చేర్చడానికి అనుకూలంగా విచిత్ర రీతిలో ఉండడంవల్ల ఇది సులభంగా సాధ్యమవుతున్నది.



అన్ని రేవులలో ఇది సాధ్యం కాదు. అటువంటి రేవులలో ఓడలను తీరానికి కనీసం 1,000 మీటర్ల దూరంలో లంగరు దించవలసి ఉంటుంది.

అలాంగ్‌కు ఈశాన్యంగా పైరాం అనే చిన్న రాళ్ళదీవి ఉన్నది. దీని ఆగ్నేయ దిశ బండలలో శిలాజాలుగా మారిన ఏనుగులు, ఖడ్గ మృగాలు, నీటిఏనుగులు, గుర్రాలు, ఎద్దులు, జింకలు, మొసళ్ళు, తాబేళ్ళు, పెద్ద చేపలు చాలా ఉన్నాయి.

ఖంబాట్ సింధుశాఖలోని మరొక ముఖ్యమైన స్థలం లోథాల్. పురావస్తు పరిశోధకులు ఇక్కడ సింధునాగరికతకు చెందిన కొన్ని అవశేషాలను కనుగొన్నారు. ప్రాచీన కాలంలో లోథాల్ ఓడరేవుగా ఉండేది. క్రీ.పూ. నాలుగు వేల సంవత్సరాలనాడు అది మెసొపొటోమియా నగరాలతో వర్తక సంబంధాలు కలిగి ఉండేది. లోథాల్ ఓడ రేవులో నీళ్ళు నిలువ చేసే పద్ధతి విలక్షణమైనది. ఆ కారణంగా సముద్రంలో అలలు తక్కువగా ఉన్నాఓడలు రేవులోకి సుల భంగా రాగలిగేవి. వెల్లువల కారణంగా ఇసుక మెట్టవేసి కాలువ పూడిపోయి, ఇప్పుడది కొన్ని మైళ్ళ దూరం భూమిగా మారిపోయింది.



లోథాల్‌కు ఆగ్నేయ దిశగా పూర్వకాలంలో కాంబే ఓడ రేవుగా ప్రసిద్ధిగాంచిన ఖంబాట్ ఓడరేవు ఉన్నది. దీనిపేరే ఈ సింధుశాఖకు కూడా వచ్చింది. ఇక్కడ బయటపడిన చమురు వనరుల వల్ల ఇది మళ్ళీ అందరి దృష్టినీ ఆకర్షిస్తున్నది. ఈ ప్రాంతంలో చాలా చోట్ల చమురు వ్యాపించి ఉన్నది. భరూచ్ జిల్లాలోని అంక్లేశ్వర్ ప్రాంతంలో కూడా చమురును కనుగొన్నారు. మధ్య ఆసియాలోనూ, ఆగ్నేయాసియాలోనూ మంచి గిరాకీ ఉన్న విలువైన కెంపురాళ్ళు తయారుచేసే లఘు పరిశ్రమకు కూడా ఖంబాట్ ప్రసిద్ధి గాంచింది. పూర్వకాలంలో ఉన్న కొన్ని రేవుపట్టణాలను మాత్రమే ఇప్పుడు గుర్తించడానికి వీలవుతున్నది. భరుకచ్ఛా అని పిలువబడిన భరూచ్ పశ్చిమ భారత దేశంలో చాలా ముఖ్యమైన వ్యాపార కేంద్రం. తపతీ నదీ తీరంలోని సూరత్ రేవు పట్టణం 16వ శతాబ్దంలో మొగలుల కాలంలో వర్తక వ్యాపారాలకూ, యాత్రలకూ



కేంద్రంగా, 'మెక్కా సింహద్వారం'గా ప్రసిద్ధిగాంచింది.17వ శతాబ్దంలో ఆంగ్లేయులు, డచ్‌వాళ్ళు, ఫ్రెంచివాళ్ళు ఇక్కడ వ్యాపార సంస్థలను, పరిశ్రమలను నెలకొల్పారు.

దక్కనుపై మొగలుల దాడికి ప్రతీకారంగా 1664వ సం॥లో మహారాష్ట్రులు శివాజీ నాయకత్వంలో సూరత్ మీద దాడి జరిపారు. సూరత్ గవర్నర్ ఇనాయత్ ఖాన్, కోటలో దాక్కున్నాడు. శివాజీ సేనలు నగరాన్ని దోచుకున్నాయి. బ్రిటిష్, డచ్ సేనలు తమ సంస్థలను, కర్మాగారాలను రక్షించుకున్నాయి. మహారాష్ట్రుల దాడిఅనంతరంమొగలులు నగరం చుట్టూ ఎత్తయిన గోడను కట్టారు.

ఆరేళ్ళ తరవాత శివాజీ రెండవసారి సూరత్ నగరం మీదికి దండెత్తాడు. మొగలు సేనలు మొదట అడ్డుకున్నాయి గాని, ఆ తరవాత కోట లోపలికి పారిపోయాయి. మరాఠీ సేనలు నగరంలోని సిరిసంపదలను కొల్లగొట్టుకుని వెళ్ళాయి. ఈ రెండు ముట్టడులతో నగరంలోని వ్యాపారం నశించి, 19వ శతాబ్దారంభానికి సూరత్



ప్రాముఖ్యత కోల్పోయి బొంబాయి బలపడసాగింది. అయినప్పటికీ సూరత్ ఈనాడు ముఖ్యమైన పారిశ్రామిక, వ్యాపార కేంద్రంగా ఉంటున్నది. పట్టు, జరీ తయారీకి పేరెన్నిక గన్నది సూరత్. వజ్రాలను మణులను సాన బట్టడంలో ఇది మనదేశంలో ప్రథమస్థానం అలంకరిస్తున్నది. 1,600 కి.మీ. పొడవైన గుజరాత్ సముద్ర తీరం చివర సంజాన్ తీరపట్టణంఉన్నది. క్రీ.శ. 8వశతాబ్దంలో మొట్టమొదట పార్సీలు అడుగుపెట్టిన స్థలానికి గుర్తుగా అక్కడ పైన అగ్ని రగులుతూన్నట్టున్న రాతి స్తంభం ఒకటి ఉన్నది.సంజాన్ మహారాజా జాదీరాణా పార్సీలను అనుమతించడానికి మొదట సంశయించాడు.ఆయన పార్సీ శరణార్థుల నాయకుడైన మెహర్జీని, “నారాజ్యం, నిండుగా ఉన్న పాల కప్పు వంటిది. అందులో మీ ప్రజలకెలా చోటివ్వగలను?” అని అడిగాడు. మెహెర్జీ, తమ ప్రజలు అక్కడి వారితో కలిసిమెలిసి ఐకమత్యంగా అందరి క్షేమానికీ కృషి చేయగలరనడానికి సూచనగా, కప్పు పాలలో కొంత చక్కెర కలిపి రాజుకు అందించాడు. మహారాజా జాదీ రాణా ఆనందించి, పార్సీలు అక్కడ ఉండడానికి అనుమతించి ఆదరించాడు. ఇచ్చిన మాట ప్రకారం పార్శీలు గుజరాతీ భాషను, కొన్ని ఆచార వ్యవహారాలను నేర్చుకుని దేశాభ్యున్నతికి పాటుపడ్డారు.

సంజాన్‌కు ఉత్తరంగా పార్సీలు ఇరాన్‌షా అటాష్ బెహ్రామ్ అనే అగ్ని దేవాలయాన్ని నిర్మించుకున్నారు. పార్సీలు ఇరాన్ నుంచి తమ వెంట తెచ్చుకున్న అగ్ని అక్కడ ఇంకా జ్వలిస్తూనే ఉన్నది. పార్సీ పూజారులు ఇరాన్‌షాలోని పవిత్ర అగ్నిని కాపాడుకోవడం, తమకు లభించిన అత్యున్నతమైన గౌరవంగా భావిస్తారు.



# మాధవయ్య నెయ్యిదానం

మాధవరం అనే జమీ గ్రామంలో, మాధవయ్య అనే నేతివ్యాపారి వుండేవాడు. అతడు నెయ్యి విషయంలో తీసుకునే జాగ్రత్తలవలన, అది కొద్దిరోజులపాటు నిలవ వున్నా, వాసనా, రుచీ విషయంలో ఎలాంటి మార్పూ రాకుండా తాజాగా వుండేది. ఈ కారణం వల్ల, ప్రజలలో అతడి దుకాణానికి మంచి పేరు వచ్చి, వ్యాపారం మూడుపువ్వులూ, ఆరుకాయలుగా అభివృద్ధి చెందింది.

ఇలా వుండగా - అక్కడి జమీందారుకు, జమీ వ్యవహారాలలో దాయాదుల వలన కొన్ని చిక్కులేర్పడి మానసికంగా అశాంతికి లోనయ్యాడు. నవగ్రహ శాంతి హోమం జరిపిస్తే చిక్కులన్నీ తొలగిపోతాయని, ఆస్థాన జ్యోతిష్కుడాయనకు సలహా ఇచ్చాడు. అంతే! నవగ్రహ శాంతి హోమానికి చురుగ్గా ఏర్పాట్లు ప్రారంభమయ్యాయి. జ్యోతిష్కుడైతే ఒక్క మాటలో నవగ్రహ శాంతి హోమం చేయించమని జమీందారుకు సలహా ఇచ్చాడు. అంతటితో అతని పని తీరిపోయింది. కానీ, అందుకవసరమైన సంబారాలన్నీ శాస్త్ర విధిగా సమకూర్చే భారం ఆస్థాన పురోహితుడిపైన పడింది. ముందుగా ఆయన హోమానికి అవసరం అయిన నెయ్యి గురించి ఆలోచించాడు. ఆ నెయ్యి తప్పక ఆవునెయ్యే అయి వుండాలి. అందులో కల్తీకి ఏ మాత్రం ఆస్కారం వుండకూడదు!

ఆస్థాన పురోహితుడు, మాధవయ్యను గురించి విన్నాడు. ఆయన అతణ్ణి పిలిపించి, సంగతి చెప్పి,"ఉన్న వ్యవధి చాలా కొద్ది. ఈ హోమానికి గాను నువ్వు పది కడవల ఆవు నెయ్యిని పంపాలి. ధర విషయం జమీందారు గారేం పట్టించుకోరు. నెయ్యిలో ఏపాటి కల్తీ కూడా వుండకూడదు. నీ నిజాయితీ గురించి వినివున్నాను. అయినా, పురోహితుడుగా నిన్ను హెచ్చరించడం, నా బాధ్యత!" అన్నాడు.

జె. ఉదయనాగశిరీష



మాధవయ్య, పురోహితుడు అడిగిన విధంగా పదికడవల ఆవు నెయ్యిని హోమానికి పంపిస్తానని మాట ఇచ్చాడు. అయితే, జమీందారుతో వ్యవహారమే కాక, దైవకార్యం కూడా కాబట్టి, మాధవయ్య స్వచ్ఛమైన పది కడవల ఆవు నెయ్యిని సంపాదించడానికి పడిన శ్రమ అంతా ఇంతా కాదు.

అదే సమయంలో, జమీందారు దగ్గర బంధువొకడికి, రాచకురుపు వేసింది. అతడు మధుమేహ వ్యాధితో బాధపడుతూ, జిహ్వాచాపల్యంకొద్దీ కొత్తగా ఈనిన ఆవు జున్ను తిన్న కారణంగా, ఈ వ్యాధి తెచ్చుకున్నాడు. అంతే కాక, మూలిగే నక్క మీద తాటి పండన్నట్టు - రాచకురుపుతోపాటు కామెర్ల వ్యాధి కూడా పట్టుకున్నది. ఈ స్థితిలో వైద్యుడు, రోగి బంధువులకు, "నేపాళం ఆకులకు ఆవు నెయ్యి రాసి వెచ్చ చేసి కురుపుకు కట్టండి. తర్వాత నేనిచ్చే పొడిని, పులుసు గరిటె ప్రమాణమంత ఆవు నెయ్యిలో కలిపి, మూడు పూటలా తినిపించండి. ఆవునెయ్యిలో ఏమాత్రం కల్తీ వుండకూడదు!" అని చెప్పాడు.

ఆ వెంటనే ఆవు నెయ్యి కోసం, జమీందారు బంధువు నౌకర్లు మాధవయ్య వద్దకు వచ్చారు.

అప్పటికి, నవగ్రహ శాంతిహోమం పది రోజుల ముహూర్తంలోకి వచ్చింది. ఆసరికి మాధవయ్య పది కడవల ఆవు నెయ్యిని సిద్ధం చేసి వుంచాడు. ఇలాంటి సమయంలో, ఆవు నెయ్యి అవసరం కలిగిన రోగి, జమీందారుకు దగ్గరబంధువు! నెయ్యి లేదంటే, జమీందారు నుంచి కూడా తనకు వత్తిడి రావచ్చు. ఏదో వీశో, అరవీశో ఇచ్చి, అయిపోనప్పుడు రమ్మనడానికి ఆయన సామాన్య సంసారి కాదు.

మాధవయ్య ఇదంతా ఆలోచించి, ఉన్న పది కడవల నెయ్యిలోంచి ఒక కడవ తీసి, జమీందారు బంధువు పంపిన నౌకర్లకిచ్చాడు. ఇది జరిగాక మాధవయ్య మరొక కడవ నెయ్యి కోసం ప్రయత్నాలు ప్రారంభించాడు.

అయితే, ఇది మాధవయ్య దురదృష్టమో, దేవుడి పరీక్షో - ఎంత ప్రయత్నించినా అతడికి పదో కడవ నెయ్యిని సంపాయించడం

సాధ్యపడలేదు. అతడు చేసేదిలేక ఆస్థాన పురోహితుణ్ణి కలుసుకుని సంగతి వివరించాడు.

అంతా విన్న ఆస్థాన పురోహితుడు చిన్నగా నవ్వి, "మాధవయ్యా, నీ నిజాయితీ మెచ్చదగిందయ్యా! మరొకరు మరొకరైతే, ఏగేదెనేతినో మిగిలిన తొమ్మిది కడవల్లో కలిపేసే వాళ్ళు. భూమి, బంగారం, తిలలు, ధాన్యం, ఉప్పు, బెల్లం, వస్త్రాలు, వెండి రూపాయలు, ఆవులు - ఈ మొదలైన తొమ్మిది దానాలతో బాటు, నెయ్యి కూడా చేరి దశదానాలని ప్రసిద్ధికెక్కాయి. నువ్వు చేస్తున్నది వ్యాపారమైనా, దైవకార్యానికి నెయ్యి ఇచ్చి పుణ్యం సంపాయించుకున్నావు. సరే, ఈ హోమం సంగతేమంటే - సాధారణంగా కిందా మీదా ఒలకబోసి నవగ్రహాలకు తొమ్మిది కడవల నెయ్యిని హోమంలో వెయ్యలేక పోతామేమో అన్న భీతితో, మరొక కడవ అదనంగా చెప్పాను. ఈ సంగతి నలుగురికీ తెలియనక్కరలేదు! నీ దగ్గరున్న తొమ్మిది కడవల నెయ్యి చాలు. ఆ పదో కడవ జమీందారు బంధువు అనారోగ్యానికి ఉపయోగపడడం, దైవనిర్ణయమే అయి వుంటుంది," అన్నాడు.

మాధవయ్య, ఆస్థాన పురోహితుడికి నమస్కరించి, పట్టరాని సంతోషంతో వెళ్ళిపోయాడు. తర్వాత నవగ్రహ శాంతి హోమం ముగిసింది. హోమం మహిమో లేక జమీందారు చాకచాక్యమో, మొత్తంమీద ఆయన



దాయాదుల గొడవల నుంచి బయటపడి ఉల్లాసంగా వున్నాడు. ఆయన బంధువుకు కూడా రాచకురుపు, కామెర్లు పూర్తిగా తగ్గిపోయాయి.

హోమం ముగిసిన రెండు రోజులతర్వాత, అనుకోని విధంగా దూరగ్రామం నుంచి ఒకతను, ఒక కడివెడు ఆవు నెయ్యి తెచ్చి మాధవయ్యకిచ్చాడు. మాధవయ్య దానిని ఎలా సద్వినియోగం చేయడమా అని బాగా ఆలోచించి, చివరకు ఆస్థాన పురోహితుడి దగ్గరకు వెళ్ళి సంగతి చెప్పి, "అయ్యా! మరొకసారి నాకిలాంటి అవకాశంరాదు.దయచేసిఆ కడివెడు నెయ్యి తమరే దానంగా పుచ్చుకోవాలి," అని కోరాడు.

భక్తిగౌరవాలతో మాధవయ్య ఇవ్వజూపిన దానాన్ని కాదనలేక, పురోహితుడు సమంత్ర కంగా దానిని స్వీకరించాడు.

మాధవయ్య చేసిన ఈ దానం గ్రామంలోని చాలామందికి తెలిసి, కర్ణాకర్ణిగా జమీందారు చెవిని పడింది. ఆయన కొంత చిరాకుతోనూ, అదే సమయంలో కుతూహలంకొద్దీ సభ చేశాడు. అందులో ఆయన బంధువుతోబాటు, పురోహితుడూ, మాధవయ్యా కూడా వున్నారు.

జమీందారు, తన బంధువు నుద్దేశించి మాట్లాడుతూ, "నవగ్రహ శాంతి హోమానికి పది కడవల ఆవు నెయ్యి కావాలని పురోహితులవారు చెప్పినప్పటికీ, మాధవయ్య తొమ్మిది కడవలతోనే సరిపెట్టాడు. మరొక కడవ మీ ఆరోగ్యానికి ఉపయోగపడిందని విన్నాను. చాలా సంతోషం. అయితే, ఇక్కడ నన్నొక సంశయం బాధిస్తున్నది. మీకు ఒక కడవ నెయ్యి ఇవ్వవలసి రావడంవల్ల, పురోహితులవారూ, మాధవయ్యా ఇందులో ఏదో లాలూచీపడి వుంటారనీ, అందువల్ల దైవ కార్యం సక్రమంగా జరగలేదనీ నేను భావిస్తున్నాను. ఇందుకు మాధవయ్య అందరికన్నా ముందుగా సంజాయిషీ ఇచ్చుకోవాలి!" అన్నాడు.

అప్పుడు మాధవయ్య, జమీందారుకు చేతులు జోడించి, "ప్రభూ! ఆపదలో వున్న వారిని దేవుడే ఆదుకుంటాడన్న నమ్మకం కలవాడిని. పురోహితులవారు నవగ్రహ శాంతికి తొమ్మిది కడవల నెయ్యి చాలునని చెప్పిన తర్వాతే, నేను పదో కడవను తమ బంధువు గారికి ఇచ్చాను. ఇప్పుడు నేను పురోహితుల వారికి దానం చేసిన కడవ నెయ్యి, హోమం పూర్తయ్యాక నేను సంపాయించినది. ఆ నెయ్యిని వాళ్ళకూ వీళ్ళకూ చిల్లరగా అమ్మడం ఇష్టం లేక, దైవజ్ఞులూ, తమ ఆస్థాన పురోహితులూ అయినవారికి దానంగా ఇచ్చాను. ఇది నా అజ్ఞానం కావచ్చునేమోకాని, తమను కించపరచడం మాత్రం నా ఉద్దేశం కాదు!" అన్నాడు.

ఇదివిని సభలో అందరూ పెద్దగా నవ్వారు. జమీందారు కూడా నవ్వి, మాధవయ్యను మెచ్చుకున్నాడు.





# ఈడు - జోడు

రంగాపురంలో, దీక్షితులు అనే పెళ్ళిళ్ళ పేరయ్య వుండేవాడు. ఆయన మంచి మాట కారి. తన మాటకారితనంతో తిమ్మిని బమ్మిని చేయగల సమర్థుడు.

అదే ఊళ్ళో నివసించే రామప్ప పంతులు, తన కుమార్తె నీలాంబరికి పెళ్ళి చేయదలచు కున్నాడు. ఆయన అష్టాదశ పురాణాలనూ, శాస్త్రాలనూ ఔపాసన పట్టిన మహాపండితుడు. అయితే, అంతటి మేధావి కడుపున పుట్టిన నీలాంబరికి చదువబ్బలేదు. దానికి తోడు ఒక కన్ను మెల్ల. అయినా, తన కుమార్తెకు మంచి అందగాణ్ణి, విద్యావంతుణ్ణి, స్థితిపరుణ్ణి చూసి వివాహం చేయాలని రామప్ప పంతులు కోరిక. ఆ కారణంగా దీక్షితులుకు ఆ పని పురమాయించాడు.

రామప్ప పంతులుకు ఉన్నఊళ్ళో బంధు బలగానికేమీ కొదవ లేదు. వాళ్ళలో కొంత మంది ఆయనతో వియ్యమందడానికి ప్రయత్నించి విఫలులయ్యారు. వరుడిది సామాన్యమైన అందమనీ, సంపన్నుడు కాదనీ, చదువు తక్కువనీ — ఇలా ఏదో ఒక వంక చూపి, ఆయన ఆ సంబంధాలు తిరస్కరించాడు.

ఒకరోజు భార్య మహాలక్ష్మి, ఆయనతో, "మనస్తాపం కలిగించే సంగతయినా, నిజం చెప్పకోక తప్పదు — మన అమ్మాయికి అందచందాలు లేవు, చదువుసంధ్యలు లేవు. దీన్ని ఏ నలకూబరుడు వచ్చి చేసుకుంటాడు చెప్పండి. మా అన్నయ్య కొడుకు రాఘవుడు, మన అమ్మాయి పరస్పరం ఇష్టపడ్డారు. మీరు సరేనంటే, అమ్మాయి పెళ్ళి సమస్య తీరిపోతుంది," అన్నది.

ఇందుకు రామప్పపంతులు కోపంగా, "ఆ రాఘవుడిలో ఏమిచూసి మన అమ్మాయి నివ్వాం అంటావు? వాడు మునసబుగారి రెండెకరాల పొలం కౌలుకు దున్నుకుని బ్రతుకుతున్నాడు. పంచాంగ శ్రవణం కూడా చేయ



రించుకుని, "పంతులుగారూ! శివపురంలో మన నీలాంబరికి సరిజోడైన సంబంధం ఒకటుంది. వరుడు, తండ్రికి ఒక్కడే కొడుకు, పేరు శుక్రుడండీ, సార్థక నామధేయుడు!" అన్నాడు.

"సార్థకనామధేయుడంటున్నారు, ఇంతకూ ఒకటా? రెండా?" అన్నాడు రామప్ప పంతులు.

"ఒక్కటేమిటండీ? రెండూనూ! అంతే కాదు, పగలు శుక్రుడైతే, రాత్రి కురునాథుడు!" అన్నాడు దీక్షితులు.

"అబ్బాయి చదువు సంధ్యలు, సంగీత పరిజ్ఞానం గురించి తమరు పెదవి విప్పారు కాదు!" అన్నాడు రామప్ప పంతులు.

"ఇదుగో, ఆ విషయానికే వస్తున్నాను. రామాయణ, భారతాల్ని తిరగేసి చదవగల, అపర వాల్మీకి, కాళిదాసుల అంశ కదుటండీ, వరుడిది! ఇక అబ్బాయి సంగీత పరిజ్ఞానం చెప్పనలవి కాదు. వీణను మురళిలాగా వాయిస్తాడు. మురళిని ఊదుతుంటే మృదంగ ధ్వని వెలువడుతుంది," అన్నాడు దీక్షితులు.

రామప్పపంతులు చిన్నగా నవ్వి, "మరి అబ్బాయి దేహదారుఢ్యం గురించి, చలాకీ తనం గురించి కూడా కాస్త చెవిన వేయండి," అని అడిగాడు.

"అయితే, వేయేల! ఒకే ఒక్క ఉదాహరణ యిస్తే, విషయం మీకు బోధపడుతుంది. వరుడి ఇంటి పెరడులో ఒక విరగకాసిన మునగచెట్టు వుంది. శాఖోపశాఖలుగా విస్తరిం

లేని దౌర్భాగ్యపు చదువు వాడిది. ఇక ఒడ్డూ పొడుగూ చూద్దామంటే, వెంపలిచెట్టుకు నిచ్చెన వేసే ఎత్తు. ఈ సంబంధానికి నేను ఒప్పుకోను," అన్నాడు.

భర్తకు ఎదురుచెప్పే ధైర్యం లేక మహా లక్ష్మి పెరట్లోకి వెళ్ళిపోయింది.

కొద్దిరోజులు గడిచిపోయాయి. ఒకరోజు ఉదయం తమ ఇంటివైపు వస్తున్న దీక్షితుల మొహం వెలిగిపోతూండడం, రామప్పపం తులు గ్రహించాడు. మనిషి వాలకం చూస్తే, తన కుమార్తెకేదో మంచి సంబంధమే తెచ్చి నట్లుందనుకున్నాడు. ఆయన దీక్షితుల్ని సాద రంగా లోనికి ఆహ్వానించాడు. దీక్షితులు అరుగుమీద కూర్చుని, ఒకసారి గొంతు సవ

చిన ఆ వృక్షాన్ని అవలీలగా ఎక్కి చిటారు కొమ్మలకు కూడా మర్కటంలాగా పాకి మునగ కాయలు కోస్తాడండీ!" అన్నాడు దీక్షితులు.

"బావుంది. అబ్బాయి భూ వసతి గురించి చెప్పండి," అన్నాడు రామప్పపంతులు.

ఇంటిలో నుంచి చూస్తే పగలు సూర్యుడు, రాత్రివేళ చంద్రుడు, నక్షత్రాలు కనిపించే ఉన్నతస్థితిలో వున్నాడు, మీకాబోయే అల్లుడు!" అన్నాడు మందహాసంతో దీక్షితులు.

ఇదివిని రామప్ప పంతులు మౌనంగా వుండడంతో దీక్షితులు, "రెండు మూడు రోజుల్లో పెళ్ళిచూపులకు ఏర్పాటు చేయమంటారా?" అని అడిగాడు.

రామప్ప పంతులు చిరుకోపంగా, "అక్కర్లేదు, అమ్మాయిని రాఘవుడికిచ్చి వివాహం జరిపించాలని, ఈ క్షణమే నిర్ణయం తీసుకున్నాను," అన్నాడు.

"శుభం!" అంటూ దీక్షితులు అక్కడినుంచి వెళ్ళిపోయాడు. మహాలక్ష్మి, భర్తవైపు అయోమయంగా చూసింది. రాఘవుడితో కూతురు పెళ్ళి జరిపించాలని, భర్త నిర్ణయం తీసుకున్నందుకు ఆనందంగా వున్నా, వరుణ్ణి చూడకుండానే శుక్రుడి సంబంధం ఎందుకు వద్దన్నాడో, ఆమెకు అంతుబట్టలేదు.

భార్య వాలకం చూసి సంగతి గ్రహించిన రామప్ప పంతులు, "చూడు మహాలక్ష్మీ! ఆ దీక్షితులు ఒట్టి మాటకారి. ఆయన తన వాక్చాతుర్యంతో, నన్ను మెప్పించాలని చూశాడు; సాధ్యం కాక వెళ్ళిపోయాడు. మా సంభాషణ సారాంశం చెబుతా విను, అని ఇలా చెప్పాడు:



వరుడి పేరు శుక్రుడట! సార్థకనామధేయుడట. అంటే, రాక్షసగురువు శుక్రాచార్యుడిలా ఒంటికన్ను వాడన్న మాట! శుక్రాచార్యుడి రెండో అవలక్షణం మధుపానం చేయడం. అది కూడా వరుడికుందని చెప్పాడు. పగలు శుక్రుడైతే, రాత్రివేళ కురునాథుడన్నాడు. అంటే, రాత్రివేళ బయటికి రాడు. ధృతరాష్ట్రుడిలా రెండు కళ్ళూ కనిపించకపోవడమే, అందుకు కారణం.

ఈ శుక్రుడి చదువు సంధ్యల గురించి చెబుతూ - రామాయణ, భారతాల్ని తిరగేసి చదవగల ప్రజ్ఞావంతుడని చెప్పాడు. ఆ ఆలు రానివాడేగదా పుస్తకాన్ని తిరగేసి చదివే మూర్ఖుడు. వాల్మీకి, కాళిదాసులు కూడా ఒకప్పుడు అక్షర జ్ఞానం లేనివాళ్ళే! అందుకే దీక్షితులు తెలివిగా, వరుడు శుక్రుణ్ణి వారితో పోల్చాడు.

తర్వాత వాడి సంగీత పరిజ్ఞానం గురించి ప్రస్తావిస్తూ, వీణను మురళిలాగా, మురళిని మృదంగంలాగా వాయిస్తాడని చెప్పాడు. ఒక వాయిద్యాన్ని మరో వాయిద్యంలాగా, ఎవరూ వాయించలేరు. వరుడికి సంగీతంలో, సరిగమలు కూడా రావని చెప్పడానికి, దీక్షితులు అలా అన్నాడు.

ఇక ఇంట్లో నుంచి పగటిపూట సూర్యుడు, రాత్రివేళ చుక్కలు, చంద్రుడు ఎప్పుడు కనిపిస్తాయి? ఇంటి పైకప్పుకు కంతలున్నప్పుడు. అంటే, వరుడు ఒక పూరిగుడిసెలో నివసిస్తాడనీ, ఆ గుడిసె కప్పు కూడా కంతలమయమనీ భావం!

రామప్ప పంతులు, భార్యకు విషయం ఇలా వివరించి, "మహాలక్ష్మీ! తెలిసిందే అయినా, దూరపు కొండలు నునుపని ఇప్పటికి అనుభవపూర్వకంగా తెలుసుకున్నాను. రాఘవుడు మన నీలాంబరికి సరిజోడవుతాడు. పైగా వాళ్ళు పరస్పరం ఇష్టపడ్డారని నువ్వు చెబుతున్నావు. ఇక నా అభ్యంతరం మాత్రం దేనికి?" అన్నాడు.

అంతవరకూ తలుపు చాటున నిలబడి, తల్లి దండ్రుల సంభాషణ వింటున్న నీలాంబరి సిగ్గుతో లోపలి గదిలోకి సంతోషంగా పరుగు తీసింది.






ద్వారకలోవారందరూ అంతర్ద్వీపంలో మహో త్సవం చూడబోవడం వల్ల అర్జునుడు సుభ ద్రను నిరాటంకంగా పెళ్ళాడటానికి అవకాశం ఏర్పడింది.

అందుకని అర్జునుడు తనకు సేవలు చేస్తున్న సుభద్రతో, "తండ్రిగాని, అన్నగాని కన్యాదానం చేయగా అగ్నిసాక్షికంగా జరిగేదే వివాహం. కాని మనం అలా పెళ్ళాడటానికి ఇప్పుడు అవకాశం లేదు. అయితే, ప్రేయసీ ప్రియులుగా ఈ రాత్రి గాంధర్వవివాహం చేసుకోవచ్చు. అది క్షత్రియ ధర్మమే. అందు చేత మనం గాంధర్వవివాహం చేసుకోవటం గురించి నీ ఉద్దేశమేమిటి?" అన్నాడు. దీనికి సుభద్ర జవాబు చెప్పక, తన అన్న అయిన కృష్ణుణ్ణి తలచుకుంటూ, కంట తడిపెట్టింది.

అర్జునుడి కోరిక తీరేటట్టు కనబడలేదు. అతను ఇంద్రుణ్ణి స్మరించాడు. దాని ఫలితంగా ఆ రాత్రి ఇంద్రుడు తన భార్య అయిన శచీ దేవినీ, అరుంధతినీ, నారదుణ్ణీ, వసిష్ఠుణ్ణీ, మరికొందరు దేవఋషులనూ, అప్సరసలనూ వెంటబెట్టుకుని, అర్జునుడున్నచోటికి వచ్చాడు.

అదే సమయానికి కృష్ణుడు, అంతర్ద్వీపంలో బలరాముడు మొదలైన వాళ్ళు నిద్రలో ఉం డగా, అక్రూరుణ్ణీ, సాత్యకినీ, గదుణ్ణీ వెంట బెట్టుకుని అక్కడికి చేరాడు. అతని వెంట దేవకీదేవీ, రుక్మిణీ కూడా వచ్చారు.

ఇంద్రుడు కృష్ణుణ్ణి కుశల ప్రశ్నలు చేసి, "నా కొడుకైన అర్జునుడికి, నీ చెల్లెలైన సుభద్ర నిచ్చి వివాహం చేయవలసింది," అని లాంఛ నంగా అడిగాడు.



"అంతకన్న మాకు కావలసిందేమిటి?" అన్నారు యాదవులు. కృష్ణుడు ఇంద్రుడికి తన సమ్మతి తెలిపాడు.

ఇంద్రుడు అర్జునుడి చేత మంగళస్నానం చేయించి, దివ్యమైన పూలదండలతోనూ, బట్టలతోనూ, ఆభరణాలతోనూ అలంకరించి వివాహమంటపానికి తెచ్చాడు.

ఈలోపుగా అరుంధతీ, శచీ, దేవకీ, రుక్మిణీ కూడా సుభద్రకు స్నానం చేయించి, వెలలేని ఆభరణాలతో అలంకరించి తెచ్చి, అర్జునుడి పక్కన కూర్చోబెట్టారు. దిక్పాలకుల సమక్షంలో, నారద వసిష్ఠాదులు సదస్యులుగా సుభద్రార్జునుల వివాహం శాస్త్రోకంగా జరిగింది. దేవతలు తమ లోకానికి వెళ్ళిపోయారు. యాదవులు అంతర్ద్వీపానికి తిరిగి వెళ్ళిపోయేటప్పుడు కృష్ణుడు అర్జునుడితో, "అర్జునా, నువ్వు ఇక్కడ ఇరవై రెండురోజులుండు. తరవాత ఈ రథం ఎక్కి సుభద్రతో సహా ఇంద్రప్రస్థానికి వెళ్ళిపో," అంటూ, సైన్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకాలనే నాలుగు గుర్రాలు గల రథాన్ని చూపాడు.

కృష్ణుడు చెప్పినట్టే అర్జునుడు ఇరవై రెండు రోజులూ ద్వారకలో గడిపి, "నా చాతుర్మాస్యవ్రతం ముగిసింది. బ్రాహ్మణ సమారాధన చేస్తాను. ఏర్పాట్లు చేయించు," అని సుభద్రతో అన్నాడు.

ఆ తతంగం ముగిసింది. కృష్ణుడి రథాన్ని ఆయుధాలతో సహా సిద్ధం చేయించమని అర్జునుడు సుభద్రను అడిగాడు. ఆమె అలాగే చేసింది. అర్జునుడు సుభద్రనూ, ఆమె చెలికత్తెలనూ రథంలో ఎక్కించుకుని, అతి వేగంగా ఇంద్రప్రస్థం వెళ్ళే మార్గాన బయలుదేరాడు.

ఇది యాదవుల కంటపడింది. "ఇదేమిటి? ఈయన సుభద్రను అపహరించుకుపోతున్నాడు. అడ్డుపడి, సుభద్రను విడిపించండి!" అంటూ కొందరు యాదవశూరులు అర్జునుడి పైన బాణాలు వేస్తూ వెంటబడ్డారు. అర్జునుడు వారిని తన బాణాలతో కొట్టి, తప్పించుకుని, రథాన్ని రైవతకాద్రి దాటించాడు.

ఈ వార్త అంతర్ద్వీపం చేరింది. అర్జునుడే సుభద్రను ఎత్తుకుపోతున్నాడని తెలిపోయింది. అక్కడ ఉన్న యాదవ వీరులు, అర్జునుడి



వెనక సేనను పంపి, అతన్ని ఓడించి, సుభ ద్రను తీసుకువద్దామన్నారు.

బలరాముడు వారిని వారించి, కృష్ణుడితో, "అర్జునుడు ఎంత ద్రోహం చేశాడో చూశావా? నువ్వేమీ మాట్లాడవేం? ఈ అవమానం కన్న చావు మేలు. నువ్వు సరేనంటే, నేను వెళ్ళి భూమిమీద కౌరవవంశం లేకుండా చేసి వస్తాను!" అని కటువుగా మాట్లాడాడు.

ఆ మాటకు కృష్ణుడు బలరాముడితో, "అర్జునుడు మనకిప్పుడు చేసిన మహాపచార మేమిటి? మనం సుభద్రకు అంతకన్న మంచి భర్తను ఎక్కడినుంచి తెస్తాం? రాక్షస వివాహం ధర్మవిరుద్ధం కాదుగదా! మీరంతా వెళ్ళి అతన్ని యుద్ధంలో ఓడిస్తారా? అది ఇంద్రుడికి కూడా సాధ్యం కాదు. యుద్ధం చేసి అర్జునుడి చేతిలో ఓడి అపకీర్తి తెచ్చుకోవటమో, అతనితో రాజీపడి, మంచిగా సంబంధం కలుపుకోవటమో ఆలోచించండి. రెండవ పద్ధతే అన్ని విధాలా మేలు," అని చెప్పాడు.

కృష్ణుడిసలహాను యాదవులందరూ మెచ్చుకున్నారు. అర్జునుడు సుభద్రతో సహా ఇంద్రప్రస్థం చేరి, తల్లికీ, అన్నలకూ నమస్కరించి, ద్రౌపది అంతఃపురానికి వెళ్ళాడు. ద్రౌపది అతన్ని చూసి, "సుభద్రతో సరసాలాడుతూ ద్వారక లోనే వుండక ఇక్కడికెందుకు వచ్చావు? అసలే రాజులు నూతన ప్రియులు. అదీగాక, ఎంత దృఢమైన బంధాలైనా పాతపడిపోతే తెగిపోతాయి. ప్రేమలు చిరకాలం ఉండవు," అని ఈర్ష్యగా మాట్లాడింది. ఆమెను అర్జునుడు తగినవిధంగా ఓదార్చాడు.

అర్జునుడి సైగ గ్రహించి సుభద్ర కుంతీ దేవికీ, ద్రౌపదికీ నమస్కారం చేసింది. ద్రౌపది ఆమెను కౌగిలించుకుని ఆశీర్వదించింది.

ఇంద్రప్రస్థంలో అందరూ సుఖంగాఉండగా, కృష్ణుడు, బలరాముణ్ణీ, అక్రూరుణ్ణీ, ఉద్ధవుణ్ణీ, సాత్యకీ, కృతవర్మా, సాంబుడూ, ప్రద్యుమ్నుడూ మొదలుగా గల యాదవప్రముఖులనూ వెంటబెట్టుకుని, సుభద్రకు సారె తెచ్చాడు. ఈ సంగతి తెలియగానే ధర్మరాజు తన నలుగురు తమ్ములనూ ఎదురు పంపాడు. యాదవులు వైభవంగా ఇంద్రప్రస్థ నగరం ప్రవేశించారు.

యాదవులు తెచ్చిన వేలాది ఏనుగులనూ, రథాలనూ, గుర్రాలనూ, పాడి ఆవులనూ, కనకాభరణాలనూ స్వీకరించి, వచ్చిన వారం దరికీ ఎదురు కానుకలిచ్చి, వారిని కొంతకాలం అతిథులుగా వుంచుకున్నాడు ధర్మరాజు. తర వాత కృష్ణుడు తప్ప మిగిలిన యాదవులందరూ ద్వారకకు తిరిగి వెళ్ళిపోయారు.

(కాలక్రమాన సుభద్రకు అర్జునుడి వల్ల ఒక కొడుకు కలిగాడు. అతనికి అభిమన్యుడు అని పేరు పెట్టారు. అభిమన్యుడంటే భయం లేనివాడనీ, కోపం గలవాడనీ అర్థం. ద్రౌపది పాండవులయిదుగురికీ అయిదుగురు కొడుకు లను కన్నది. ప్రతివింధ్యుడూ, సుతసోముడూ, శ్రుతసోముడూ, శతానీకుడూ, శ్రుతసేనుడూ అని ఉపపాండవుల పేర్లు. వీరందరికీ అర్జు నుడే ధనుర్విద్య నేర్పాడు. విలువిద్యలో అర్జునుడంత వాడనిపించుకున్న వాడు అభి మన్యుడు.)

కృష్ణుడు ఇంద్రప్రస్థంలో ఉండగా ఒక భయంకరమైన వేసవి వచ్చింది. అరణ్యాలు అంటుకుని, వాటిమీదుగా వేడిగాడ్పులు వీచాయి. నదులు ఎండిపోయాయి. పడమటి వడగాలికి ప్రాణికోటి తల్లడిల్లిపోయింది.

ఆ వేసవిలో అర్జునుడు కృష్ణుడితో, "ఈ వేసవి దుర్భరంగా వుంది. ఈ సమయంలో యమునా తీరాన గల పర్వతారణ్యాలలో వేటా డుతూ, ఇళ్ళు కట్టుకుని చల్లగా కాలక్షేపం చేస్తే ఎంతో సుఖంగా ఉంటుంది," అన్నాడు.



కృష్ణుడు నిజమేనన్నాడు. కృష్ణార్జునులూ, కొందరు స్నేహితులూ, పరివారమూ బయలు దేరి చల్లని అరణ్య ప్రాంతంలో విడిసి, అక్కడ సుఖంగా సంచరించసాగారు. ఒకనాడు వాళ్ళు ఖాండవవన సమీపంలో చందనపు చెట్ల కొమ్మల నీడన పొదరిళ్ళలో కూర్చుని సుఖంగా భోజనాలు చేశారు. కృష్ణార్జునుల వెంట ద్రౌపదీ సుభద్రలు కూడా ఉన్నారు. అందరూ శరీరాలకు చందనం పూసుకుని, పూలమాలలు ధరించి ఉన్నారు. అందరూ సంతోషంగా కథలూ, కబుర్లూ చెప్పుకుంటున్నారు.

ఆ సమయంలో ఒక ముసలి బ్రాహ్మణుడు వారివద్దకు వచ్చాడు. అతను చాలా ఎత్తు న్నాడు. అతని శరీరం కాంతివంతంగా ఉన్నది.



నారబట్టలు కట్టి, జడలు ధరించి ఉన్నాడు. అతని మీసాలు గోరోజన వర్ణంగా ఉన్నాయి. అతను వారితో, "అయ్యా, నేను భోజన ప్రియుణ్ణి. మంచి జీర్ణశక్తి గలవాణ్ణి. నాకు ఇష్టమైన ఆహారం మీరు పెట్టినట్టయితే తింటాను. తిని తృప్తి చెందుతాను," అన్నాడు.

ఈ మాటకు కృష్ణార్జునులు, "బ్రాహ్మణుడా, నీకు ఎలాంటి ఆహారం కావాలో కోరుకో," అన్నారు.

"నేను అగ్నిహోత్రుణ్ణి. నాకు వేరే ఆహారం అవసరం లేదు. ఈ ఖాండవ వనాన్ని భక్షించాలని నా కోరిక. ఎన్నోసార్లు ప్రయత్నించాను. కాని ఇంద్రుడు ధారాపాతంగా వర్షం కురిపించి నా ప్రయత్నాలకు విఘ్నం కలిగిస్తూ వస్తున్నాడు. తక్షకుడు మొదలైన సర్పాల సహాయంతో ఈ వనాన్ని ఎల్లప్పుడూ కాపాడుతున్నాడు. మీవంటి మహాశూరులు సహాయపడితేగాని, నా ప్రయత్నం ఫలించదు. అందుచేత మీరు సహాయపడండి," అని ఆ బ్రాహ్మణుడు అన్నాడు.

అగ్నిహోత్రుడు ఖాండవవనాన్ని దహించటానికి ప్రయత్నించాడంటే, దానికి కారణం ఉన్నది.

పూర్వం శ్వేతకి అనే రాజు ఒకడుండేవాడు. అతను విడవకుండా యజ్ఞాలు చేస్తూండేవాడు. ఒకసారి అతను అతి దీర్ఘమైన యాగం ఒకటి చేశాడు. అందులో శ్వేతకికి సహాయం చేసిన బ్రాహ్మణులకు పొగ మూలాన కంటి జబ్బులు వచ్చాయి. శ్వేతకి వారి స్థానంలో ఇతర బ్రాహ్మణులను తెచ్చి యాగం పూర్తి చేశాడు.

కాని శ్వేతకి మరొకసారి యాగం ప్రారంభించదలిస్తే ఎవరూ రానన్నారు. రాజు ఎంత ప్రాథేయపడినా వారు ఒప్పుకోక, "నువ్వు చేసే యాగాలకు ఋత్విక్కుగా పనిచెయ్యటం మహాశివుడికి మాత్రమే సాధ్యమవుతుంది," అన్నారు.

శ్వేతకి కైలాసానికి వెళ్ళి శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమయ్యాడు.

"దేవా, నా యాగానికి నువ్వే యాజకుడివిగా ఉండు," అని శ్వేతకి శివుణ్ణి ప్రార్థించాడు.

"యాజకులుగా వుండే పని బ్రాహ్మణులది. అయినా, పన్నెండేళ్ళపాటు అగ్నిని అర్చించావంటే నీ కోరిక తీరుతుంది," అంటూ శివుడు అంతర్ధానమయ్యాడు.

శ్వేతకి శివుడు చెప్పిన ప్రకారం పన్నెండేళ్ళ పాటు అగ్నికి నేతులు ఆహుతి పోసి, తిరిగి శివుడి వద్దకు వచ్చాడు.

శివుడు శ్వేతకితో, "యాజకుడు బ్రాహ్మణుడే కావాలని చెప్పాను గద. అందుచేత నేను పనికిరాను. కాని నా అంశన జన్మించిన దుర్వాసుణ్ణి యాజకుడుగా పంపిస్తాను. యజ్ఞానికి అవసరమైన ఏర్పాట్లు చేసుకో," అన్నాడు.

శ్వేతకి అన్ని ఏర్పాట్లూ చేసుకున్నాడు. శివుడు దుర్వాసుణ్ణి యజ్ఞం చేయించమని పంపాడు. దుర్వాసుడు యజ్ఞం జరిపించి, దక్షిణ తీసుకుని వెళ్ళిపోయాడు.

చివరకు జరిగిందేమంటే అగ్నిహోత్రుడికి, నెయ్యి తెగతాగి, అజీర్తి రోగం పట్టుకున్నది. అతని తేజస్సు క్షీణించింది. అతను బ్రహ్మ వద్దకు వెళ్ళి, తన అజీర్ణం పొయ్యే మార్గం చెప్పమన్నాడు.

బ్రహ్మ అగ్నిని చూసి నవ్వి, "అంతులేని నెయ్యి తాగి, అజీర్తి తెచ్చుకున్నావు. ఖాండవ వనాన్ని దహించినట్టయితే నీ వ్యాధి నయమై, నీ తేజస్సు నీకు తిరిగివస్తుంది. ఖాండవ వనంలో అనేక రకాల ప్రాణులూ, దివ్య ఓషధులూ, వనస్పతులూ, మహావృక్షాలూ ఉన్నాయి. అవి నీ వ్యాధి నివారణ చేస్తాయి," అన్నాడు.

అగ్ని బ్రహ్మ మాట విని ఖాండవవనంలో ప్రవేశించి, దాన్ని దహించటం మొదలుపెట్టాడు. కాని వెంటనే ఏనుగు తొండాలంత ధారలతో వాన వచ్చింది. ఆ వనంలో ఉండే ఏనుగులూ, పాములూ కూడా నోళ్ళతో నీరు తెచ్చి అగ్నిహోత్రుడి మీద పోశాయి. అతని యత్నం విఫలమయింది.

అగ్ని ఖాండవవనాన్ని దహించటానికి ఏడు సార్లు ప్రయత్నించాడు. అతని ఏడు ప్రయత్నాలూ విఫలమయ్యాయి. అగ్ని బ్రహ్మ వద్దకు తిరిగిపోయి, తాను ఖాండవవనాన్ని దహించలేకపోయాననీ, తన రోగం ఇంకా అలాగే ఉన్నదనీ తెలిపాడు.



# వార్తలలో బాలలు

## పాఠ్యపుస్తకంలో చోటు

మహాపురుషుల బాల్యానికి సంబంధించిన విశేషాలను పాఠ్యగ్రంథాలలో చేర్చడం మామూలు విషయమే. పసిపిల్లలకు ఉత్తేజం కలిగించి, మహనీయుల అడుగు జాడలలో వాళ్ళు నడిచేలా చేయడానికి ఈ పాఠాలు దోహదం చేస్తాయి. అయితే, మద్రాసులోని ఒక పాఠశాలలో చదవుకుంటూన్న కేరళకు చెందిన బి.రాజీష్ అనే పదకొండేళ్ళ



కుర్రాణ్ణి గురించిన విశేషాలను ఛాయాచిత్రంతో సహా ఆరవ తరగతి మలయాళ వాచకంలో ప్రచురించింది తమిళనాడు పాఠ్య గ్రంథాల కమిటీ. బి. రాజీష్ కరాటే ఛాంపియన్. గత సంవత్సరం కెనడాలోని లీథ్‌బ్రిడ్జ్‌లో పదిహేనేళ్ళలోపు పిల్లలకు జరిగిన అంతర్జాతీయ కరాటే ఛాంపియన్ షిప్ పోటీలలో బంగారుపతకం సాధించాడు. 1993వ సం॥ జంషెడ్ పూర్‌లో జరిగిన నేషనల్ ఛాంపియన్ షిప్ పోటీలలోనూ,1995వసం॥లో జబల్‌పూర్‌లో జరిగిన ఛాంపియన్‌షిప్ పోటీలలోనూ బంగారు పతకాలు సాధించాడు. బడిలో చేరడానికి ముందే అతడు కరాటే నేర్చుకోవడం ప్రారంభించాడు. బడిలో చేరాక, చదువు పాడవకుండా రోజూ నాలుగుగంటలసేపు కరాటే అభ్యసించేవాడు. ఎనిమిదేళ్ళలో బ్లాక్ బెల్ట్ సాధించాడు. రాజీష్ కెనడా నుంచి తిరిగి వచ్చినప్పుడు ముఖ్యమంత్రి స్వయంగా వెళ్ళి స్వాగతం పలికి ఏం కావాలో కోరుకోమంటే — కరాటే ప్రాక్టీస్ చేయడానికి చాలినంత స్థలం కావాలన్నాడు రాజీష్. ఇరవై సెంట్లు స్థలం మంజూరు చేయగలమని ముఖ్యమంత్రి మాట ఇచ్చారు.

## చిత్రకారుడు — నటుడు

కేరళకు చెందినమరొక విద్యార్థి నితిన్ కె. డేవిడ్. వయసుపన్నెండేళ్ళు.అతని



పేరు 'గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్'లో నమోదు చేయడానికి సిఫార్సు చేయబడింది.ఇంతవరకు35,000 చిత్రాలు చిత్రించి అతడు సరికొత్త రికార్డు సృష్టించాడు. అతి పిన్న వయసు నుంచే పెన్సిల్‌తో బొమ్మలు గీయడం ప్రారంభించాడు. పెన్సిల్ పేనా అయింది. పేనా బ్రష్ అయింది.అతడు బొమ్మలుగీయడానికి వాటర్ కలర్స్, ఆయిల్ కలర్స్ రెండూ వాడతాడు. కంప్యూటర్ సహాయంతో కూడా అతడు కొన్ని చిత్రాలు రూపొందించాడు. సినిమాలో నటించడానికి 'బాల నటులు కావాలి' అన్న ప్రకటనను చూసి, దరఖాస్తు పంపి అందులో ఎంపికయ్యాడు. డేవిడ్ నటించిన మలయాళ చిత్రం ఇటీవల విడుదల అయింది.

## బహుముఖ ప్రజ్ఞాశాలి

బెంగళూరుకు చెందిన 'సెంటర్ స్టేజ్' అనే సంస్థ, మద్రాసులోని ఒక పాఠశాలలో పదకొండవ తరగతి చదువుతూన్న ఎన్. ఆరావముదన్ అనే విద్యార్థి బహుముఖ ప్రజ్ఞను గుర్తించి 'ఈ యేడు బాలుడి'గా అవార్డు నిచ్చి, సత్కరించింది. అతడి ఉన్నత విద్యకు ఉపకారవేతనం రూపంలో లక్ష రూపాయలు అందజేస్తుంది. ఆరావముదన్ చదువుతోపాటువ్యాసరచన,క్విజ్,చిత్రలేఖనం,మృదంగం వాయించడం వ్యక్తిత్వ పరీక్షలు మొదలైన వాటిలో మొదటివాడుగా వచ్చాడు.అతనుచదువుతూన్న పాఠశాలలో తొమ్మిదవ తరగతి చదువుతూన్న కౌశిక్ జయరామన్ 'ఈయేటి వర్ధమాన విద్యార్థి'గా పదివేల రూపాయల బహుమతి అందుకున్నాడు.

చందమామ
అనుబంధం - 86

మన దేశపు
చెట్లు

# బాడిత చెట్లు

మన దేశమంతటా వ్యాపించి ఉన్నప్పటికీ బాడితచెట్లు బీహారు, బెంగాలు ప్రాంతాలలోనూ, సముద్రతీరఅరణ్యాలలోనూ విరివిగా కనిపిస్తాయి. వృక్ష శాస్త్రంలో దీనిని 'ఎరిత్రీనా ఇండికా' అని అంటారు. ఇండియాకు చెందిన ఎర్రపూల చెట్టు అని ఇది సూచిస్తుంది. వీటి పువ్వులు ఎర్రగా, పొడవుగా, మూసుకుని ఉంటాయి. పెద్ద ఆకులు మూడు ఉపదళాలు కలిగి ఉంటాయి. కొన్ని ప్రాంతాలలో ఈ ఉప దళాలను బ్రహ్మ విష్ణు మహేశ్వర రూపాలనీ, మన దేశంలో కొందరు క్రైస్తవులు వీటిని పిత, కుమారుడు, పరిశుద్ధఆత్మగా – అంటే దైవస్వరూపంగా భావిస్తారు. ఆకులు తొడిమల వద్ద ఒకదానికొకటి ఎదురెదురుగా వుంటాయి.

ఆకులు గుబురుగా గల ఈ చెట్లు పది హేను మీటర్ల ఎత్తు వరకు పెరుగుతాయి. ఉద్యాన వనాలలోనూ, బాటకిరువైపులా వీటిని అలంకార వృక్షాలుగానూ, నీడ కోసమూ నాటి పెంచుతారు. ఈ చెట్ల వేళ్ళు భూమిని నత్రజనితో నింపి సారవంతం చేస్తాయి.కాబట్టి,టీ తోటల మధ్య అక్కడక్కడా వీటిని నాటి పెంచుతారు.

కొమ్మలలో కొంకె తిరిగిన చిన్నచిన్న ముళ్ళు ఎక్కువగా ఉండడం వల్ల అక్కడి బెరడు గరుకుగా ఉంటుంది. చెట్టు ముదిరిన తరవాత ముళ్ళు రాలిపోతాయి.

ఫిబ్రవరి, మార్చి నెలలలో ఆకులు రాలే సమయంలో పూలు పుట్టుకు వస్తాయి. ఆ తరవాత ఆకులు చిగురిస్తాయి.

బాడిత చెట్టును హిందీలో పాంగ్రీ అనీ, మరాఠీలో పంగారా అనీ, బెంగాలీలో రక్త మదార్ అనీ, మలయాళంలో మందారం అనీ, తమిళంలో మరుకా, ముళ్ మురుంగా అనీ అంటారు.



మనదేశపు ఋషులు : 10

# కపిలుడు

సూర్యవంశానికి చెందిన సగర మహారాజు అశ్వమేధ యాగం చేయ తలపెట్టి, సర్వలక్షణయుతమైన ఒక అశ్వాన్ని అలంకరించి జైత్రయాత్రకు వదిలాడు. అశ్వం వెంట అరవై వేల మంది సగర రాజకుమారులు నడిచారు.

అశ్వం వివిధ రాజ్యాలను తిరిగింది. కాని దానిని ఎవరూ ఆపలేకపోయారు. హఠాత్తుగా ఒకనాడు అశ్వం కనిపించకుండా పోవడంతో, ఎక్కడెక్కడో వెతికి ఫలితం లేక వాళ్ళు ఆ విషయాన్ని తండ్రికి తెలియజేశారు. సగరుడు, "యాగాశ్వం భూలోకంలో లేదంటే, పాతాళం చేరి ఉంటుంది. భూమిని తవ్వి పాతాళంలో వెదకండి!" అని ఆజ్ఞాపించాడు.

సగర కుమారులు నలుదిశలా భూమిని తవ్వుతూ వెళ్ళి, ఆఖరికి పాతాళలోకం చేరారు. అక్కడ దివ్యతేజస్సుతో ఒకమునితపస్సు చేసుకుంటున్నాడు. ఆయన పక్కనే యాగాశ్వం బంధింపబడి ఉన్నది. ఆ దృశ్యాన్ని చూసిన రాకుమారులు ఆగ్రహించి, మునిని దుర్భాషలాడుతూ బంధించబోయారు. తపోభంగమైన ముని కళ్ళు తెరిచాడు. ఆ క్షణమే రాకుమారులు భస్మమై, బూడిద కుప్పలైపోయారు. అశ్వాన్ని అపహరించి, అక్కడికి తీసుకువచ్చి బంధించిన వాడు ఇంద్రుడని తెలియక, ముని మీద తొందరపాటుతో ఆగ్రహించి బూడిదైపోయారు సగరకుమారులు!

సగర మహారాజు మునిమనమడైన భగీరథుడు, అకుంఠిత దీక్షతో తపస్సు చేసి, ఆకాశ గంగను భూమికిదించి, తనవెంట పాతాళానికి తీసుకువెళ్ళి, ఆ పవిత్ర జలాలను బూడిద రాశులపై ప్రవహింపజేసి తాతలను బ్రతికించుకున్నాడు.

సగరకుమారులను ఒక్క చూపుతో భస్మం చేసిన మునిపుంగవుడు కపిలుడు. ఆయన గొప్ప విష్ణుభక్తుడు; విష్ణువంశ సంభూతుడని కూడా చెబుతారు. కర్దమప్రజాపతి --- దేవహూతుల కుమారుడు. తండ్రి మరణానంతరం, ఆయన తన తల్లికి జ్ఞానోపదేశం చేసి, విష్ణు సాయుజ్యం పొందేలాగా చేశాడు. మన షడ్దర్శనాలలో ఒకటైన సాంఖ్య దర్శనానికి మూల పురుషుడు కపిలముని!



# మీకు తెలుసా?

1. నాజీజం స్థాపకుడు ఎవరు?
2. హిందూ పురాణాల ప్రకారం మొట్టమొదట మరణించిన మానవుడు ఎవరు?
3. ఇత్తడిని ఎలా తయారుచేస్తారు?
4. 'దంత మందిరం' ఎక్కడ ఉన్నది?
5. పదమూడు దీవుల మీద నిర్మితమైన నగరం ఏది?
6. సాలెపురుగుకు ఎన్ని కళ్ళున్నాయి?
7. బంగ్లాదేశ్‌లో విరివిగా పండే పంట ఏది?
8. ఆస్ట్రేలియాలో ద్వీపంగా ఉన్న రాష్ట్రం ఏది?
9. 'ది కల్నల్' అని పిలువబడిన భారతీయ క్రికెట్ క్రీడాకారుడు ఎవరు?
10. అంకారాకు పూర్వం టర్కీ రాజధాని ఏది?
11. మన జాతీయపతాకంలోని అశోకచక్రంలో ఉన్న ఆకులెన్ని?
12. గ్రీసు కరెన్సీ పేరేమిటి?
13. ఫతేపూర్‌సిక్రీని నిర్మించిన వారెవరు?
14. సూయెజ్ కాలువ ఎప్పుడు తెరవబడింది?
15. ఒకరోజు క్రికెట్ ఆటలలో ఇండియా తరఫున ఆడి 'సెంచరీ' సాధించిన మొట్టమొదటి క్రీడాకారుడు ఎవరు?
16. టెలివిజన్ కనుగొన్నవారెవరు?
17. తాత్కాలిక ప్రధాని బాధ్యతలను రెండుసార్లు నిర్వహించినవారెవరు? ఎప్పుడు?
18. 'సుమో' అనే కుస్తీలు ఏ దేశానికి సంబంధించినవి?
19. 'హార్స్ పవర్' అనే మాటను మొదట వాడిన వారెవరు?
20. అతి పెద్ద ద్వీపం ఏది?

## సమాధానాలు

1. అడాల్ఫ్ హిట్లర్.
2. యముడు.
3. రాగి, తుత్తునాగం మిశ్రమంతో.
4. శ్రీలంకలోని కాండీలో. బుద్ధుడి దంతం భద్రపరచబడి ఉన్నది.
5. స్వీడన్ రాజధాని స్టాక్‌హోమ్.
6. ఎనిమిది.
7. జనుము.
8. టాస్మానియా.
9. దిలీప్ వెంగ్‌సర్కార్. సి.కె. నాయుడు భారత సైన్యంలో కల్నల్‌గా ఉండేవాడు.
10. ఇస్తాన్‌బుల్.
11. ఇరవై నాలుగు.
12. డ్రాక్మా.
13. అక్బర్ చక్రవర్తి.
14. 1869లో.
15. కపిల్‌దేవ్ (1983).
16. జాన్ లాగీ బాయిర్డ్.
17. గుల్జారీలాల్ నందా (1964; 1966).
18. జపాన్.
19. జేమ్స్ వాట్.
20. గ్రీన్‌ల్యాండ్.




# రసహృదయం

రామశర్మ అనేకవి,రసహృదయులకు కవిత్వం చెప్పి వాళ్ళిచ్చింది తీసుకుని తృప్తి పడతాడు. ఆయనకు ధనవ్యామోహం లేదు.

ఒకసారి రామశర్మకు పట్నంలో సత్యవాది అనే వ్యాపారి, కవిత్వమంటే చెవి కోసుకుంటా డని తెలిసింది. ఆయనను కలుసుకోవాలని బయల్దేరి రామశర్మ, కొంతదూరం నడిచాక అలసట కొద్దీ ఒక చెట్టు కింద విశ్రమించాడు.

కొద్ది సేపట్లో అక్కడికి ఒక పేదవాడు వచ్చాడు. వాడప్పుడే పొలంపని చేసి, అలసట తీర్చుకునేందుకు అక్కడికి చేరాడు. వాడు రామశర్మనుచూస్తూనే,"అయ్యా!మీముఖంలో దివ్యతేజస్సు గోచరిస్తున్నది.తమరు కవులు కాదుగదా?" అని అడిగాడు.

రామశర్మ తను కవినని చెప్పాడు. వాడు వెంటనే, "అయ్యా! గొప్పగా చదువుకోక పోయినా, కవిత్వం అర్థం చేసుకోగల పాటి జ్ఞానం నాకున్నది. తమరు నా జీవితం మీద కవిత్వం చెబితే వినాలని ఆశగా వున్నది," అన్నాడు.

అప్పుడు రామశర్మ వాడికథ అడిగి తెలుసుకున్నాడు. వాడి తల్లిదండ్రులు ముసలి వాళ్ళు. భార్య అనుకూలవతి.రెండేళ్ళ కొడుకున్నాడు. రోజూ పొలం పనులు చేస్తే పది రూపాయలు ఇస్తారు. దానితో అవసరాలు గడుపుకుంటాడు. తీరికసమయంలో భార్య తినుబండారాలు చేసి అమ్ముతుంది. అందువల్ల సుఖంగానే రోజులు గడిచిపోతున్నాయి. అయితే — అన్నింటికీ మించి వాడు కవిత్వం వినడంలోనే సంతోషపడతాడు.

వాడి కథ వినగానే రామశర్మలో భావావేశం పుట్టింది.ఆయన ఆ పేదవాడిపై ఆసువుగా పది పద్యాలు చెప్పాడు. అది విని పేదవాడు కళ్ళు తుడుచుకుని, "అయ్యా! వినడానికి నా కథ ఇంత బాగుంటుందని, మీరు చెప్పాకనే తెలిసింది," అంటూ కవికి పది

"వసుంధర"

రూపాయలు ఇవ్వబోయాడు. రామశర్మ మొహ మాట పడుతూ, "నా కవిత్వం నీకు నచ్చింది. అదే నాకు సంతోషం. నువ్వు నాకు డబ్బు ఇవ్వ వద్దు. అది నీకు అవసరం," అన్నాడు.

పేదవాడు నవ్వి, "మీరు నా పైన పద్యాలు చెప్పడానికి సంకోచించనందుకు చాలా సంతోషం కలిగింది. డబ్బు తీసుకునేందుకు కూడా సంకోచించకండి. లేకుంటే తమరు నా సత్కారాన్ని అవమానించినట్లు, నాకు తోస్తుంది," అన్నాడు.

రామశర్మ చప్పున ఆ డబ్బు తీసుకున్నాడు. అంతలో పేదవాడికి పనిలోకి వెళ్ళే సమయం వచ్చింది. వాడు, రామశర్మ వద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. కాసేపటికి రామశర్మ కూడా మరికొంత దూరం ప్రయాణం కొనసా గించే సరికి, బండిలో అటుగా వెళుతున్న రాజకుటుంబీకుడొకడు అయనను చూసి బండి ఆపించాడు. రామశర్మ కవి అని తెలి యగానే, ఆయన కూడా ఎంతో సంతోషించి, ఆయనను బండిలోకి రావలసిందిగా కోరాడు.

ఆ రాజకుటుంబీకుడు కూడా కవిత్వ మంటే చెవి కోసుకుంటాడు. ఆయన రామ శర్మను తనపై కవిత్వం చెప్పమని కోరితే, రామశర్మ, రాజకుటుంబీకుడి కథ అడిగాడు.

ఈ రాజకుటుంబీకుడి పేరు శ్రవణుడు. రాజుకు అత్యంత ప్రీతిపాత్రుడు. దేశమంతా తిరిగి ఎక్కడెక్కడ సుందర ప్రదేశాలున్నదీ తెలుసుకుని రమ్మని, రాజు ఆయనను నియోగించాడు. అందుకుగాను నెలకు యాభై వేల రూపాయల జీతాన్నిస్తున్నాడు. శ్రవణుడు





ఆపని మీద బయల్దేరడం వల్ల, తానెంతో ప్రేమించే భార్యకు దూరమయ్యాడు.

ఇది వింటూనే రామశర్మలో కవితావేశం పొంగుకువచ్చింది. ఆయన, శ్రవణుడి భార్య, భర్త దూరమైనందుకు పడే ఆవేదనను కవిత్వంగా చెప్పసాగాడు. అదివింటూంటే శ్రవణుడికి, తను స్వగృహంలో వున్నట్టే అనుభూతి కలిగింది.

కొంతసేపటికి బండి పట్నం చేరుకున్నది. శ్రవణుడు, రామశర్మకు అయిదు వందల రూపాయలిచ్చి, "అయ్యా! ఇది తమ కవిత్వానికి వెలకాదు; నాశక్తికి కొలబద్ద. ఈ డబ్బును మీరు తీసుకుని నన్నానందపరచండి," అన్నాడు.

రామశర్మ ఆడబ్బు తీసుకుని బండి దిగి, వారినీ వీరినీ అడిగి తెలుసుకుని సత్యవాది ఇంటికి వెళ్ళాడు. ఆ ఇల్లొక ఇంద్రభవనంలా వున్నది. సంశయిస్తూనే ఆయన లోపలికి అడుగుపెట్టాడు. సత్యవాది భార్య రుక్మిణి ఆయనకు ఎదురుపడి, "తమ ముఖంలో దివ్యతేజస్సున్నది, కవీంద్రులా?" అని అడిగింది.

అవునన్నట్టు తలవూపాడు రామశర్మ.

రుక్మిణి తన భర్త గురించి చెప్పింది. అతడుచాలావ్యాపారాలుచేస్తున్నాడు. ఉదయం ఇల్లు వదిలితే, రాత్రి వేళకు గానీ రాడు. అదృష్టమేమో — అతడు పట్టిందల్లా బంగారమవుతుంది. రోజుకు పది వేల రూపాయలకు తక్కువ కాకుండా సంపాదిస్తాడు. ఒక్కొక్క రోజున యాభై వేల రూపాయల వరకూ వుంటుంది సంపాదన.

సత్యవాది కవిత్వమంటే ఎంతగా చెవి కోసుకుంటాడంటే, ఎలాంటి పనిలో వున్నా సరే వదిలి, కవిత్వం వినడానికి వచ్చేస్తాడు. రామశర్మ కవి అని తెలియగానే, రుక్మిణి నలుగురు పనివాళ్ళను పట్నం నాలుగు వైపులకూ పంపి, రామశర్మకు తనే స్వయంగా మర్యాదలు చేసింది.

ఆ ఇల్లు, వాతావరణం చూసిన రామశర్మ, తను వేళకాని వేళలో వచ్చినందుకు నొచ్చుకుంటూ, "నేను మళ్ళీ వద్దునుకదా, వారి కోసం పనివాళ్ళను పంపారెందుకు?" అన్నాడు.

దానికి రుక్మిణి, "తమబోటి కవీంద్రులు వచ్చినప్పుడే, ఆయన ఇంటి పట్టున వుండేది. మీ వంటివారు వస్తే, మా ఇంటిల్లిపాదికీ పండుగలా వుంటుంది," అన్నది.

కొద్దిసేపట్లోనే సత్యవాది పరుగున వచ్చాడు. అది మధ్యాహ్నసమయం కావడంతో, అందరికీ శీతలపానీయాలిచ్చింది రుక్మిణి.

"కొత్తగా పద్యాలు చెప్పినా సరే, లేక మీ కావ్యమేదైనా నాకు వినిపించినా సరే!" అన్నాడు సత్యవాది, రామశర్మతో.

రామశర్మ కుదురుగాకూర్చుని, తన కావ్యంలోనిఒక్కొక్క పద్యమే చదువుతూంటే, సత్యవాది తన్మయుడై వినసాగాడు. కాసేపటికి సత్యవాది ఇంట్లోని వారంతా ఒక్కొక్కరుగా వచ్చి, అక్కడ కూర్చున్నారు. చివరకు పనివాళ్ళు కూడా వచ్చారు. అందరూ కవిత్వం వింటున్నారు. మధ్యలో రుక్మిణి కొందరు పనివాళ్ళను పురమాయించి ఫలహారాలు, ఫలరసాలూ అందే ఏర్పాటు చేసింది.

కావ్యపఠనం చీకటి పడిన తర్వాతకూడా మరికొంతసేపు కొనసాగింది. అది ముగియగానే అందరూ కావ్యాన్ని గురించి ముచ్చటించుకుంటూ భోజనాలు చేశారు. కావ్య విషయంలో తనకు కలిగిన సందేహాలను కొన్నింటిని సత్యవాది అడిగితే, వాటికి రామశర్మ బహునేర్పుగా సమాధానాలిచ్చాడు.

సత్యవాది, రామశర్మను వెయ్యినూట పదార్లతో సత్కరించి, "కవిత్వానికి విలువ నెవరు కట్టగలరు? చంద్రునికో నూలుపోగు. స్వీకరించండి!" అన్నాడు.



"నా భర్తను ఒక పూట అంతా ఇంటి పట్టున వుంచినందుకు, తమకీ సత్కారం; కవిత్వానికి కాదు," అన్నది రుక్మిణి.

ఆ రాత్రికి రామశర్మ, అక్కడే పడుకునేందుకు ఏర్పాట్లు చేయబడ్డాయి. సత్యవాది, ఆయనతో, "తమరు బాగా విశ్రాంతి తీసుకుని, రేపు నెమ్మదిగా ప్రయాణం కండి. తమరు నిద్రలేచేసరికి నేను బయటికి వెళ్ళిపోవచ్చు. ఇదే వీడ్కోలుగా భావించండి!" అంటూ సెలవు తీసుకున్నాడు.

మర్నాడు రామశర్మ నిద్రలేచేసరికే, సత్యవాది వెళ్ళిపోయాడు. రామశర్మ, ఆ ఇంటి వారి నుంచి సెలవు తీసుకుని, తన ఊరికి తిరిగి వెళ్ళి భార్యకు జరిగినదంతా చెప్పి, సత్యవాదిని అదేపనిగా మెచ్చుకోసాగాడు.

అప్పుడు రామశర్మ భార్య, "మీరు సత్యవాది వెయ్యిన్నూట పదార్లిచ్చాడని మురిసిపోతున్నారేమో! అదాయన సంపాదనతో చూస్తే ఎన్నో వంతు? శ్రవణుడు, మీకు తన రోజు సంపాదనలో నాలుగో వంతు కంటే ఎక్కువ ఇచ్చాడు. పేదరైతు అయితే మీకు మొత్తం రోజు సంపాదనంతా ఇచ్చుకున్నాడు. నిజానికి మీరు పేదరైతును మెచ్చుకోవాలి!" అన్నది.

ఇందుకు రామశర్మ పెద్దగా నవ్వి, "వెర్రిదానా! పెద్దలిచ్చిన ఆస్తి కూర్చుని తిన్నా, నాలుగు తరాలు వస్తుంది. నాకు డబ్బు మీద మమకారం లేదు. మనుషుల విలువను డబ్బుతో పోల్చిచూసే అలవాటూ నాకు లేదు. పేదరైతు తీరిక సమయంలో, నా కవిత్వం విన్నాడు. శ్రవణుడు ప్రయాణం చేస్తూ, నా కవిత్వం విన్నాడు. సత్యవాది ఒక్కడే తన పని మానుకుని వచ్చి మరీ, నా కవిత్వం విన్నాడు. ఆ సమయం ఎంత విలువైనదంటే — అందువల్ల ఆయనకు కొన్ని వేల రూపాయలు నష్టం కలుగుతుంది. నేను, వారు నాకవిత్వం వినడానికిచ్చిన సమయం విలువనే తప్ప, వారిచ్చిన డబ్బును అంచనా వేయలేదు. ఆ ప్రకారం చూస్తే, సత్యవాది ముందు మిగతావారు సరిపోగలరా?" అన్నాడు.

అప్పటికి రామశర్మ భార్యకు, కవిహృదయం మెచ్చే రసహృదయం ఎలా వుండాలో అర్థమయింది.






# పేదపెళ్లికొడుకు

పూర్వం ఒక దూరదేశంలో ఒక చిన్నరాజుండే వాడు. ఆయన అంతగా కలవాడు కాడు. ఆయనకు గుణమణి అని ఒక అందమైన కుమార్తె ఉండేది. తన స్థితిలో తానై ఆమెకు గొప్ప సంబంధం తీసుకురాలేక, ఆయన ఆమెకు స్వయంవరం జరప నిశ్చయించాడు. స్వయంవరం ప్రకటించినప్పుడు కన్యను పెళ్ళాడ గోరినవారంతా వచ్చి, ఆమెకు తమ తమ తాహతులను బట్టి బహూమానాలిస్తారు. అలా వచ్చినవారిలో తనకు నచ్చినవాణ్ణి కన్య వివాహమాడుతుంది.

గుణమణిని పెళ్ళాడటానికి వచ్చిన రాజ కుమారులందరిలోకీ ఆర్భాటంగా వచ్చిన వాడు భద్రుడనేవాడు. అతని తండ్రి పేరు దుర్జ యుడు. ఆయన చాలా భయంకరుడు, క్రూరుడు. కేవలం దుర్మార్గంతో ఆయన చాలామంది రాజులకు అశాంతి కలిగించాడు. దుర్జయుడి బాధ పడలేక ఒకప్పుడు పదిమంది రాజులు ఒకచోట సమావేశమై అతనిపైన దండెత్తటానికి నిశ్చయించారు. వారు సమావే శంనుంచి వెళ్ళిపోతూండగాదుర్జయుడు దారి కాచివారిలో అయిదుగురిని బందీలుగా పట్టు కుని, ఎంతో ధనం వారివద్ద నుంచి తీసుకుని వదిలేశాడు.

గుణమణి స్వయంవరానికి భద్రుడు వచ్చి రాజద్వారం చేరిన సమయానే వీరుడనే మరొ కడు కూడా చేరాడు. ఇతను ఒక ముసలి గుర్రాన్ని ఎక్కి, సొట్టలు పడి మాట్లు వేసిన కవచం ధరించి అతి పేదగా ఉన్నాడు. దుర్జయుడికి చిక్కి తమకు గల ధనమంతా ధారపోసి ప్రాణాలతో బయటపడిన అయిదు గురు రాజులలో వీరుడి తండ్రి కూడా ఒకడు. అందుచేతనే వీరుడింత పేదగా ఉండటం జరిగింది.

భద్రుడు వీరుడుకేసీ, అతని ముసలి గుర్రం కేసీ నిరసనగా చూసి, అతన్ని తోసు



కుంటూ తన గుర్రాన్ని రాజద్వారం కుండా ముందుకు అదిలించాడు. వీరుడు అతన్ని ముందుకు వెళ్లనిచ్చి, "రాజులు వచ్చేటప్పుడు నౌకర్లే ముందు నడుస్తారు," అన్నాడు. భద్రుడికి మండిపోయింది. అవకాశం చూసి తన ప్రతాపం చూపుదామనుకున్నాడు.

స్వయంవరంలో మొదటిది రాజకుమారుల బల పరాక్రమ ప్రదర్శనం. ఒక మైదానంలో ఈ ప్రదర్శనం ఏర్పాటు చేయబడింది. ప్రదర్శనాన్ని చూడటానికి రాజ కుటుంబం వారితోబాటు గుణమణి కూడా వచ్చింది. రాజకుమారులందరిలోకీ భద్రుడు చుక్కల్లో చంద్రుడల్లే ప్రకాశిస్తున్నాడు. అన్ని రకాల పోటీలలోనూ అతనిదే పైచేయిగా వుంది.

కాని వీరుడు తక్కువ తిన్నవాడు కాదు. ద్వంద్వయుద్ధాలలో భద్రుడు ఓడించినవారి కన్న ఎక్కువ మందినే వీరుడు ఓడించాడు. అయితే భద్రుడికీ, వీరుడికీ ద్వంద్వయుద్ధం జరిగినప్పుడు మాత్రం వీరుడు ఓడిపోయాడు. ఇందులో ఆశ్చర్యం లేదు. భద్రుడి వెంట చాలా గుర్రాలున్నాయి. ఒక్కొక్కరితోనూ యుద్ధం చెయ్యటానికి అతను ఒక్కొక్క గుర్రం ఎక్కాడు. వీరుడి గుర్రం అనేక యుద్ధాలు చేసి అలిసిపోయి ఉన్నది. అందుచేత వీరుడు భద్రుడి మీద ఓడాడు.

సూర్యాస్తమయం కాగానే అతిథులందరూ దర్బారు భవనంలో సమావేశమైనారు. ఒక్కొక్కరే గుణమణి వద్దకు వచ్చి తాము తెచ్చిన కట్నాలు ఆమెకు సమర్పించారు. ఎంతో విలువైన కట్నాలు తెచ్చిన రాజకుమారులెందరో ఉన్నారు. అయినా భద్రుడు తెచ్చిన కట్నాల ముందు ఇవేవీ రాణించలేదు. అందరికన్నా ఆఖరుకు వచ్చినవాడు వీరుడు. అతను తన కత్తిని తీసి గుణమణి ముందు పెట్టి, "నేను పేదవాణ్ణి. నాకున్న అమూల్యమైన వస్తువు ఇదొకటే!" అన్నాడు.

"దాని గొప్ప మాత్రం ఏముంది? ఇంతకు ముందు అది నిన్ను ఓడనివ్వలేదా?" అని భద్రుడు ఎత్తిపొడిచాడు.

"మనిద్దరి మధ్యా సమయుద్ధం జరిగి ఉంటే ఈ కత్తి మహిమ చవిచూసి ఉండేవాడివే!" అన్నాడు వీరుడు.

మర్నాటి కార్యక్రమం అరణ్యంలో వేటాడటం, అతిథులందరూ తమ తమ గుర్రాలెక్కి వేటకు బయలుదేరారు. వీరుడు కూడా అడవికి వెళ్ళాడుగాని అతను వేటాడి తన గుర్రాన్ని శ్రమపెట్టదలచలేదు. అందరికన్న చొరవగా వెళ్ళిన భద్రుడు మొదలైనవారి వెంట గుణమణి కూడా గుర్రమెక్కి వెళ్ళింది. కాని కొంత దూరం పోయాక ఆమెకు వేటమీద ఉత్సాహం తగ్గిపోయి వెనక్కి తిరిగి రాసాగింది. వీరుడు ఆమెకు ఆ సమయంలో ఎదురు పడ్డాడు.

"మీకు వేటమీద ఆసక్తి లేదా?" అని గుణమణివీరుణ్ణిఅడిగింది. "ఉన్నది.కాని నా గుర్రం ముసలిదైపోయింది. ఎంతోకాలంగా మావంశానికిసేవచేసింది.దానిని శ్రమపెట్టటం ఇష్టంలేదు,"అన్నాడువీరుడు.

"మంచి గుర్రం లేని కారణం చేత మీరు అన్నింటా వెనకపడుతున్నట్టున్నారు. నా గుర్రం తీసుకుని, మీ గుర్రం నాకిచ్చెయ్యండి," అన్నది గుణమణి.

"ఈ గుర్రం నాకు ప్రియమైనది. ఇది ఎంతో కాలంగా మాకు సేవ చేసింది. దీనిని ఎవ్వరికీ ఇవ్వను," అన్నాడు వీరుడు.

"నిన్న మీరు నాకు కత్తి ఇస్తూ అదే మీకు అమూల్యమైనదన్నారు. ఆ మాట అబద్ధమేనన్న మాట!" అంటూ గుణమణి తన గుర్రాన్ని అదిలించి, వెనక్కు తిరిగి చూడకుండా వెళ్ళిపోయింది.

అక్కడితో స్వయంవరం కార్యక్రమం ముగిసింది. గుణమణి తన నిర్ణయాన్ని మరొక నెలకు ప్రకటిస్తుంది. అతిథులు బయలుదేరి





వెళ్ళిపోసాగారు. వీరుడికి తప్ప మిగతా అందరికీ గుణమణి వీడ్కోలు చెప్పింది. వీరుడికేసి ఆమె చూడనైనా లేదు. ఇందుకతను చాలా చింతించాడు. అతను రాచనగరు దాటి కొంత దూరం వచ్చేసరికి ఒక గొర్రెలకాపరి కుర్రవాడు కనిపించాడు.

వీరుడు ఆ కుర్రవాణ్ణి పిలిచి, "నువ్విప్పుడు చూసే విషయం మీ రాజకుమార్తెకు తెలియజెయ్యి," అంటూ గుర్రం దిగి, తన కత్తి తీసి దానితో గుర్రాన్ని చంపి, "గుణమణి కోసం నిన్ను బలి చేశాను!" అని చచ్చిన గుర్రంతో అని తన దారిన తాను వెళ్ళిపోయాడు.

ఇది జరిగిన వారం రోజులకు వీరుడి ఇంటి బయట ఒక మేలుజాతి గుర్రం కట్టివేసి ఉంది. దాని మెడలో ఒక బిళ్ళపైన "ప్రత్యక్షమైన తేడాలు సరిచేయవచ్చు," అని రాసి వుంది. ఆ గుర్రం గుణమణి పంపినదే నని ఊహించి వీరుడు ఎంతో సంతోషించాడు.

నెల గడిచిపోయింది. గుణమణి స్వయంవరంలో పాల్గొన్న రాజకుమారులంతా ఆమె నిర్ణయం తెలుసుకోవటానికి మరొకమారు వచ్చారు. ఆమె శతవిధాల భద్రుడినే పెళ్ళాడుతుందని అందరూ అనుకున్నారు. కాని ఆమె వీరుణ్ణి తన భర్తగా స్వీకరిస్తున్నానని అందరి యెదుటా పలికింది. అందరూ ఆశ్చర్యపోయారు, భద్రుడు మాత్రం మండిపోయాడు.

"ఈ వీరుడి ప్రజ్ఞ నేనింతవరకు చూడలేదు. వివాహం జరగక ముందు, నేనో అతనో ద్వంద్వయుద్ధంలో తేల్చదలచుకున్నాను," అన్నాడు భద్రుడు.

"ఈ పూట వేటకు పోదాం. వేట నుంచి తిరిగి వచ్చాక మీలో ఎవరితోనైనా సరే నేను యుద్ధానికి సిద్ధమే," అన్నాడు వీరుడు.

అతిథులందరూ అరణ్యానికి వెళ్ళి, పగలల్లా వేటాడారు. సాయంకాలానికల్లా అందరూ తాము అడవిలో కొట్టిన జంతువులతో సహా తిరిగి వచ్చారు. భద్రుడూ, వీరుడూ మాత్రం తిరిగిరాలేదు. వాళ్ళిద్దరూ అరణ్యంలో ఏమి అఘాయిత్యానికి దిగారోనని గుణమణి భయపడింది. కాని భద్రుడు బోలెడన్ని జంతువులను చంపి చీకటిపడే సమయానికి

వాటితో సహా తిరిగి వచ్చాడు. వీరుడి జాడ లేదు. అతనికోసం చాలాసేపు వేచివుండి మిగిలినవారు భోజనాలకు లేచారు. ఆ సమయానికి వీరుడు తిరిగి వచ్చాడు. అతని వాలకం చూస్తే ఒక్క మృగాన్ని కూడా కొట్టి నట్టు కనబడలేదు.

"ఇంత ఆలస్యం చేస్తే ఎంత గొప్ప వేట చేసి వస్తావో అనుకుంటున్నాం. ఏవీ నీవు కొట్టిన జంతువులు?" అన్నాడు భద్రుడు.

"నేను ఎక్కువ జంతువులను వేటాడలేదు. అయినా వేట దొరకడం, దొరకకపోవటం కేవలం దైవాధీనం. ఇది అందరూ ఎరిగిన విషయమే!" అన్నాడు వీరుడు.

"నువ్వు కొట్టినదేదో బయటపెట్టరాదా? ఎందుకిన్ని కబుర్లు?" అన్నాడు భద్రుడు.

"ఇదుగో!" అంటూ వీరుడు తన పైబట్ట చాటునుంచి ఒక మనిషి తల తీసి భద్రుడి కాళ్లముందు పడేశాడు. అది భద్రుడి తండ్రి అయిన దుర్జయుడి తల.

కొంతసేపు ఎవరి నోటా మాట లేదు. అందరూ దిగ్భ్రాంతులైపోయారు. కాని తర వాత వారి మనసులు ఆనందంతో నిండిపో యాయి. ఈ దుర్జయుడు ఎందరినో హీన స్థితికి తెచ్చాడు; అందరికీ పక్కలో బల్లెంగానే ఉన్నాడు. అటువంటి దుర్మార్గుణ్ణి ఇంత కాలా నికి ఈ వీరుడు తుదముట్టించాడు. అందుచేత అతనిపై అందరికీ గొప్ప గౌరవం ఏర్పడింది.

భద్రుడికి మటుకు చేతులూ, కాళ్ళూ చల్లబడ్డాయి. తన తండ్రి బలం అండ చూసు కునే అతను దర్పంగా తిరిగాడు. అటువంటి శూరుణ్ణి చంపినవీరుడంటేభద్రుడికి చెప్పరాని భయం కలిగింది. అందుచేత అతను వీరుణ్ణి ద్వంద్వ యుద్ధానికి పిలవలేదు. కనీసం తన తండ్రిని చంపినందుకు పగ తీర్చుకుందామని అయినా ప్రయత్నించలేదు. అందుచేత భద్రు డిపై అందరికీ గౌరవం పోయింది.

తరవాత గుణమణికీ వీరుడికీ వివాహ మయింది. గుణమణి స్వయంవరానికి వచ్చిన రాజులందరూ పెళ్లికి వుండిపోయారు. తర వాత భద్రుడు తన తండ్రి కోటను విడిచి, కొద్ది పాటి బలగంతో ఎటో పారిపోయాడు. ఆ కోట వీరుడి వశమయింది. అతను చుట్టుపక్కల రాజులతో స్నేహ సంబంధాలు ఏర్పరచుకుని తన భార్యతో సుఖంగా రాజ్యం చేశాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1996 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.



S.G. Shesagiri



S.G. Shesagiri

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * డిసెంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

### అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : భూమినే నమ్ముకున్న తల్లులు.... రెండవ ఫోటో : ఈ భూగోళంలో కోకొల్లలు!

పంపినవారు : ఎస్. బాలకృష్ణారావు

M — 5/9, 84 రామ్‌బాగ్ ఎం.ఐ.జీ. కాలనీ, నాగపూర్ — 440 003, (మహారాష్ట్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 60.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama *Buildings, Vadapalani*, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

